ఓం

శ్రీ సచ్చిదానందాయనమః

# శ్రీ భూమానంద వాక్యామృతము

అను

సందేహనివర్త్యోపన్యాసము

అచల పరిపూర్ణ పరతత్వ కందార్థ దరువులు

భ్రాంతి రహిత తత్వములు

సాధకులజ్ఞాన పరీక్షార్థమై నలుబది ప్రశ్నలు

శ్రీ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణులగు

శ్రీమత్ శివరామ దీక్షిత అచల గురు పీఠసాంప్రదాయకులును

శ్రీ సచ్చిదానందపగడాల వేంకటేశ్వర అవధూత స్వాముల వారి

ప్రియశిష్యులగు

భూమానంద మందిప్పల హనుమంతరాజయోగీంద్రుల వారిచే

రచియింపబడి

శ్రీ మదచల గురుపీఠ సాధకులైన వారి ప్రేరేపణచే

వీరి ప్రియ శిష్యుడు

శ్రీపూర్ణానంద అరిగె రామస్వామి మహారాజుగారిప్రియశిష్యురాలైన

శ్రీమతి దాసానంద ఈపూరు రత్నమ్మగారి

ద్రవ్య సహాయమువలన పునః ముద్రింపబడియె

**1988**

: గ్రంధ ముద్రణకర్త :

శ్రీ దాసానంద ఈపూరు శేషఫణిగారు

ఓం

శ్రీ సచ్చిదానందాయనమః

# శ్రీ భూమానంద వాక్యామృతము

అను

సందేహనివర్త్యోపన్యాసము

అచల పరిపూర్ణ పరతత్వ కందార్థ దరువులు

భ్రాంతి రహిత తత్వములు

సాధకులజ్ఞాన పరీక్షార్థమై నలుబది ప్రశ్నలు

శ్రీ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణులగు


శ్రీమత్ శివరామ దీక్షిత అచల గురు పీఠసాంప్రదాయకులును

శ్రీ సచ్చిదానందపగడాల వేంకటేశ్వర అవదూత స్వాముల వారి

ప్రియశిష్యులగు

శ్రీ భూమానంద మందిప్పల హనుమంతరాజయోగీంద్రుల వారిచే

రచియింపబడి



శ్రీ మదచల గురుపీఠ సాదకులైన వారి ప్రేరేపణచే

వీరి ప్రియ శిష్యుడు

శ్రీపూర్ణానంద అరిగె రామస్వామి మహారాజుగారిప్రియశిష్యురాలైన

శ్రీమతి దాసానంద ఈపూరు రత్నమ్మగారి

ద్రవ్య సహాయమువలన పునః ముద్రింపబడియె

**1988**

: గ్రంధ ముద్రణకర్త :

శ్రీ దాసానంద ఈపూరు శేషఫణిగారు




ఓమ్

ఇదివేదాంత విచారణ కథకాదు, జనన మరణ వ్యధమానుటకై
ఆగమనిగమోపనిషత్సాగరమథితార్థము.
పాండిత్య తర్క వితర్క అభిమానరహితులకు
రత్నములు, ఇతరులకు రాళ్ళు. అందముగ ఘనులు మెచ్చెదరు.
చందురుడుదయంబందిన సింధువు చెలరేగునుగాని
చెరువులు బావులు కుంటలు నదులు చెలరేగవు.

గ్రంథకర్త




శ్లో॥ అచలపరిపూర్ణ కేవలాత్మస్వ స్వరూపకం ।
పిలుఖానలక్ష్మణ ప్రషుదేశి కేంద్ర కారణం ।
బృహద్వసిష్టసద్విచార సాధుమార్గవర్తనం ।
శ్రీవేంకటేశ్వరావధూతసద్గురుంభజామ్యహం ॥



శ్రీ సచ్చిదానంద పగడాల వేంకటేశ్వర అవదూత స్వామివారు

శ్రీభూమానందాయనమః

# అవతారిక

## అచలగురుపరంపరము

శ్రీమదఖండ సచ్చిదానందాతీత అచలపరిపూర్ణులైన, శ్రీ శ్రీధర స్వాములవారి ప్రియశిష్యులు శ్రీమద్రామడుగు శివరామదీక్షితులవారును, వారిప్రియశిష్యరత్నమగు, శ్రీమత్కం బాలూరు అప్పారావు మంత్రిగారును, వారిప్రియశిష్యులగు శ్రీమత్పరశురామ సీతారామస్వాములవారును, వారి ప్రియశిష్యులగు శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశిక స్వాములవారును, వారి ప్రియ శిష్యులగు శ్రీ పీల్లానలక్ష్మణదేశిక ప్రభువరులును వారిప్రియశిష్యులగు శ్రీసచ్చిదానంద వెంకటేశ్వరఅవధూత స్వాములవారును, వారిప్రియశిష్య రత్నమగు, శ్రీభూమానంద హనుమంత రాజయోగి యనుదీక్షనామము, సద్గురుమూర్తిచే అనుగ్రహింప బడియున్న, మత్తిలగ్రామ నివాసులగు మందిప్పల వంశాబ్ధిచంద్రుడైన నాగనార్యతత్పత్నీ ఆశమాంబగర్భ సంజాతుండునైన, హనుమంతరావుగారు సందేహనివర్త్యోపన్యాసము, అచల పరిపూర్ణ పరతత్వ కందార్థదరువులు, భ్రాంతి రహితతత్వములు, సాదకుల జ్ఞానపరీక్షార్థమై నలుబదిప్రశ్నలు రచియింపబడి ముద్రితమైయుండినవి.

ఇందులో శ్రీభూమానందులవారి ప్రియశిష్యులు వ్రాసిన కొన్ని తత్వములు, కీర్తనలు, మేలుకొలుపు, జండావందనముపాట, మంగళ హారతులు జేర్చి ఈ గ్రంధమును సకలముముక్షుజనులకందరికిని సులభో పాయముగ, తెల్లముగదేట పడునటుల వున్నది వున్నట్లుగా ప్రస్తుతము (2000) ప్రతులు అచ్చువేయించనయినది.



ప్రకాశకులు—

శ్రీ శివరామ దీక్షితాచల గురుపీఠం
శ్రీభూమానంద నిజపూర్ణబోధ నిలయం
శ్రీపూర్ణానంద రాజయోగాశ్రమము.
కర్నూలు. ఆం. ప్ర.




శ్రీ సద్గురుభ్యోనమః.



శ్లో॥ గురుర్బ్రహ్మం గురుర్విష్ణుం । గురుర్దేవో మహేశ్వరః ।
గురురేకంపరబ్రహ్మం । తస్మై శ్రీగురువేనమః ॥

శ్లో॥ నగురోరధికం నగురోరధికం । నగురోరధికం నగురోరధికం ।
శివశాసనతశ్శివ శాసనత । శ్శివశాసనతశ్శివశాసనతః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగనసదృశం । తత్త్వమస్యాదిలక్ష్యం ॥
ఏకంనిత్యం విమలమచలం । సర్వదాసాక్షిభూతం ।
భావాతీతం । త్రిగుణరహితం । సద్గురుంతన్నమామి ॥



## —( శ్రీ మదచలగురుపరం పరస్తుతి. )--

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యాగురువిష్ణుసూర్యాం । శ్రీయాజ్ఞ్యవల్క్యాం ।
జనకంశుకంచ । సాందీపమీశం కృష్ణంచ అర్జునం ।
వందేగురున్మేగురుపాదు కాంతం ॥

శ్లో॥ శ్రీధరస్వామినంనిత్యం । బోధకారణమవ్యయం ।
భావాతీతమహంవందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారుజనమందారం । వందేహంతన్నిరంతరం ।
రామడుగువంశజంశుద్ధం । శివరామాఖ్యదీక్షితం ।

శ్లో॥ యస్య బోధోదయాత్సర్వం । బ్రహ్మైవేత్యవగమ్యతే ।
శివరామే విధిఖ్యాతం । తద్దైవతముపాస్మహే ॥

శ్లో॥ కామాదిరిపుహంతారం । కారుణ్యామృతసాగరం ।
కంబాలూర్యప్పరావాభి । దానంవందేద్యమద్గురుం ॥

శ్లో॥ శ్రీమత్పరశురామాన్వ । యాబ్ధిచంద్రమనోరమం ।
నిత్యానందమహంవందే । సీతారామగురుంపరం ॥

శ్లో॥ నిత్యంసాంద్రకృపారసంవిదిత । భావభావమత్యున్నతం ।
ద్వంద్వాతీతమమత్పరంపరమ । కల్యాణాత్మతత్వంవిదుం ।
బ్రహ్మానందమయం సుబోధనిలయం । స్వానందభావంసదా ।
శ్రీ మద్భాగవతాన్వయాబ్ధివిలస । శ్రీకృష్ణచంద్రంభజే ॥

శ్లో॥ శ్రీవత్సగోత్రకల శాంబుధిపూర్ణచంద్రం ।
శ్రీకృష్ణపాదకమలా మృతపానభృంగం
శ్రీపీలుఖాన వంశాంబుధి రేవజాతం ।
శ్రీలక్ష్మణార్యమనసా స్వగురుంభజామ్యహం ॥

శ్లో॥ అచలపరిపూర్ణ కేవలాత్మస్వ స్వరూపకం ।
పీలుఖానలక్ష్మణ ప్రభుదేశి కేంద్ర కారణం ।
బృహద్వసిష్టసద్విచార సాధుమార్గవర్తనం ।
శ్రీవేంకటేశ్వరా వధూతసద్గురుంభజామ్యహం ॥

శ్లో॥ వెంకటేశ్వరపాదార । విందామృతరసాయనం ।
పిబన్మత్తమనోభృంగం । హనుమంతంగురుంభజే ॥

శ్లో॥ శ్రీ భూమానందప్రియశిష్యరత్నం ।
నిజపూర్ణ బోధ ప్రబోధకం ।
శ్రీ పూర్ణానంద మహంవందే ।
అరిగె రామయార్య గురుంభజే ॥

శ్లో॥ అస్మద్గురుసమారంభాం । కృష్ణసాందీపమధ్యమాం ।
శ్రీ మహావిష్ణు పర్యంతాం । వందేగురుపరం పరాం ॥

శ్రీ శ్రీ శ్రీ



—:♦: శ్రీ సద్గురవేనమః :♦:—



సద్గురుమూర్తి నిహేతుకజాయమాన కటాక్షవీక్షణమున పరమదయాళుండైనా కాన తిచ్చిన జననమరణ రహితంబగు మోక్షమార్గ మునకు సంబంధంబగు గురుబోధ నేను విని కనిన విచారణకును ప్రపంచమునందు మోక్ష మును గురించి ప్రయత్నించు కొందరి లోకుల విచారణకును వ్యత్యాస మగుపడినందున, ఆ కొరత దేనియందుకలదోయని విచారణజేయ నుత్సాహము గలిగి, ఉపన్యాస రూపముగా విమర్శించ నిశ్చయించుకొన్నవాడను. అదియెట్లనగా,

శ్లో॥ శాస్త్రదృశ్యం గురుర్వాక్యం । తృతీయం ఆత్మనిశ్చయం।
చతుర్ధం సంశయచ్ఛేదం । పంచమం ముక్తిదాయకం ॥

అనగా, శాస్త్ర సమ్మతమును గురువాక్య సమ్మతముచే నిశ్చయ బుద్ధిగలిగి సంశయ రహితమైనవారికి మోక్షము చేకూరగలదని శ్లోకము యొక్క భావము. శాస్త్రమునకు, గురువాక్యమునకు, అనుభవమునకు వ్యతిరేకముకాకుండా యీ మూటిసమ్మతముగా విచారణ చేయవలెనను వుద్దేశ్యము. విచారణకు ముఖ్యాంశములేవంటే

౧ పరమార్థమనగా ఎటువంటిది ?

౨ ప్రపంచమనగా ఎటువంటిది ?

౩ శాశ్వితమేది, అశాశ్వితమేది ?

౪ ప్రపంచోద్భవమెట్లు ?

౫ పారమార్థమునకు, ప్రపంచమునకు, సంబంధముకలదా ?

౬ ఈ రెంటిని విచారించు మనమెవ్వరు ?

౭ మోక్షమెవ్వరికి ?

ఈ యంశములను చక్కగా విచారించుటకు ముముక్షువులకు పరమ ధర్మమైయున్నది గనుక పరమార్థమనగా,

శ్లో॥ యస్యంతర్నాదిమధ్యం । నహికరచరణం ననామగోత్రం ।
నసూత్రం । నోజాతి । ర్నైవవర్ణం । నభవతిపురుషో ॥
నానపుంసో । నచస్త్రీ । నాకారం । నైవికారం । నహిజననమరణం ।
నాస్తిపుణ్యం । నపాపం । నోతత్వం । తత్వమేకం । సహజసమ
రసం । తత్పరమంనమామి ॥ యనియు,

శ్లో॥ సర్వశూన్యం మయంరూపం । జన్మశూన్యం స్వభావతః ॥ యనియు,

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ । దేహోనాస్తికదాచన ॥ యనియు,

శ్లో॥ నిత్యశుద్ధ నిరాభాసం । నిరాకారం నిరంజనం ॥ యనియు,

శ్లో॥ అవాచ్యం హ్యఖండం । హ్యలక్షం హ్యబాధ్యం ।
హ్యసంగం హ్యవేద్యం । హ్యచింత్యం హ్యరూపం ।
హ్యసాధ్యం హ్యనాద్యం । హ్యతీతం హ్యనంతం ।
హ్యశుద్ధం హ్యబుద్ధం । హ్యనామం నమామి ॥ యనియు,

శ్లో॥ ఆనందరహితోస్మి నిత్యమచలం ।
నిఘాత నిఘోత నిరింద్రియత్వం ।
నిమోహ నిర్ద్వంద్వ నిరూపసత్యం ।
పరాత్పరం నిత్యమహంనమామి ॥ యనియు,

శ్లో॥ నైనంచిదంతిశస్త్రాణి । నైనందహతిపావకః ।
నచైనంక్లేదయంత్యాపో నశోషయతిమారుతః ॥ యనియు,

శ్లో॥ నిర్గుణో నిష్క్రియోనిత్యో । నిర్వికల్పో నిరంజనః ।
నిర్వికారో నిరాకారో । నిత్యముక్తోస్మినిర్మలః॥ యనియు,

శృతి॥ క్షరాక్షరాభ్యాం విలక్షణః ॥ యనియును,

ఆ పరమార్ధము ఆదిమధ్యాంతములు లేనిదనియు కరచరణాద్యవయవములు లేనిదనియు నామము, రూపము, గోత్రము, సూత్రములేనిదనియు, పురుష నపుంసక స్త్రీవర్ణము కాదనియు, ఆకార వికారములు గాదనియు, జనన మరణములు లేనిదనియు, పాపపుణ్యములు లేనిదనియు, పంచవింశతి తత్వములుగానిదనియు, తత్వాతీత తత్వమనియు, సహజ సమరసత్వమైనదనియు పైనగల శ్లోకములయందును శృతులయందును చెప్పబడుచున్నది. ఇదియునుగాక,

కం॥ సామర్థ్యమేమిజూపదు । కామక్రోధాధికముల । గలయదనిశమే ।
బాములెరుంగదు । ఇతరులు యేమనినను మారుబల్క 'దనియును'

కం॥ పలుకున బలుకగరాకను । తలపోయుదమనిన మదికి । దగుల
దనియును,

కం॥ దానము ధర్మము సగుణ । ధ్యానము ప్రతిమార్చనంబు । తజ్జప
తీర్థస్నానము "లెన్నిజేసినను మాటలాడ దనియును,"

కం॥ ధ్వనిమొదలగు తన్మాత్రలు । గనుగొనగా లేశమైన గాన్పించని
దనియును,

కం॥ ఇంతంతని యనరానిది । వింతలు శాయనిది । యెన్నివిధముల
గనిన౯। చింతలెరుంగనిది । అనియు శ్రీభాగవత శ్రీకృష్ణదేసికప్రభు
వరులవారు ఆనతిచ్చినారు.

గనుక ఉపాసనలు చేసినను సప్తకోటి మహామంత్రములుచ్చరించినను సాధనములు చేసినను అనేకవిధములైన చూపులు చూచినను మనసు నిలిపినను అనేకవేషములు ధరించిన, యజ్ఞయాగాది క్రతువులు జేసినను, గోదాన, భూదాన, సువర్ణదానములెన్ని జేసినను వేదశాస్త్రపురాణాద్యేతిహాసములు చదివి మహావిద్యావంతుండైనను గొప్పమహాత్ముడైనను పరమార్ధమును దెలుసుకోలేదని చక్కగా బోధపడుచున్నది. యిందులో యేమైనసంశయమా॥ లేదుకదా। రెండవప్రశ్న। ప్రపంచమెటు వంటిదనగా,

మిధ్యాస్వరూపమైనది, నామరూప కులగోత్ర వర్ణాశ్రమ ధర్మములుఁగలది, అశాశ్వితమైనది. జననమరణ ప్రవాహములకు వునికిపట్టయినది, గనుక ప్రపంచము అశాశ్వితమనియును పారమార్థము శాశ్వితమనియును తేటపడు చున్నది, అయితే ఈ మిధ్యాస్వరూపమైన ప్రపంచము యెట్లుపుట్టినది యెవరివలనవచ్చినది, అనివిచారించగా పైనజెప్పబడిన పరమార్ధమే కారణ మనుకోవచ్చును, అయితే ఆ పరమార్ధము సంకల్పవికల్పాది గుణములు లేనిదనియు జననమరణములు లేనిదనియు, శృతి స్మృతి ఉపనిషద్వాక్య ములయందు చెప్పబడుచున్నది.

కం॥ పుట్టదుగిట్టదు వకరిని । పుట్టించదు చంపబోదు । భూమ,
యెరుకదా । పుట్టునుగిట్టును వకరిని ।
పుట్టించును సమయజేయు । భూమకితరమై ।

యనియు శ్రీభాగవతుల కృష్ణదేశికులవారు సెలవిచ్చియున్నారు, గనుక, పరమార్ధమువలననే ప్రపంచము పుట్టినదనుటకు కేవలవిరుద్ధముగా నున్నది గాన ప్రపంచము మాయవలన పుట్టి మాయచేతనే నశించుచున్నట్లు దృఢముగా బోధపడుచున్నది, మాయ యెవరివలన వుద్భవించినదనగా,

గీ॥ మాయదెలియరాదు మాయమూలములేదు । మాయవాయురూప మాయ మమత । మాయవల్లబుట్టె మదఅహంకారంబు । యనియు,

క॥ యెరుకోత్పత్తినిదెలియగ । సరసిజ గర్భాదులైన। చాలరనెడిచో । నరు డెంతవాడు వాడది । తెలియుదు ననవట్టిమాట । యని పెద్దలు చెప్పి యున్నారు.

అయితే మాయపుట్టుక యెంతటివారికిని తెలియదనినయడల విచా రణకు కొంతకొరతగా వచ్చునని ప్రశ్నించవచ్చును. ఈ కొరత సద్గురు మూర్తిచే విడిపోగలదు (యెరుకను విడిపించలేరు । యెవ్వరుధాత్రిఁ । గురు డొకడు తప్ప) యని శృతివాక్యముకలదు (ఈ సంశయము మది నిల్ప రాదు । నీవెన్నడు యిధివినలేదు) యనునట్లు సద్గురునిచేరిన వారికి తెలియ

గలదు । యిదియునుగాక మాయవలన ప్రపంచమైన విధము యెట్లనగా, ఈ మాయ త్రిగుణస్వరూపమై, ఉత్పత్తిస్థితి లయములకు, మూలకారణమై మూడువిధములైనది, సత్వగుణమున శుద్ధమాయ, తమోగుణమున మలిన మాయ, రజోగుణమున మిశ్రమాయయై శుద్ధమాయ దేవత్వము, మలిన మాయ జడత్వము, మిశ్రమాయ జీవత్వములుగా పరిణమించినది, యెట్లనగా శుద్ధమాయ సత్వగుణ ప్రధానమై బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఆదిశక్తి. పరాశక్తి, స్వర్గము, వైకుంఠము, కైలాసము, పరమపదవి, ముక్తి, మోక్షము, లక్ష్మి సరస్వతి, పార్వతి, లింగస్వరూపము, జోతిస్స్వరూపము, మంగళస్వరూపము, నిర్గుణబ్రహ్మ, శ్రీయః పతి, శ్రీమన్నారాయణ యనియు యింకా అనేక పరియాయ నామములచేత పరిణమించినది మలినమాయ, తమోగుణ ప్రధానమై, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి, ప్రకృతి, అవిద్య అనాత్మ, జడము, అమంగళము, దృశ్యరూపములుగా పరిణమించినది, శుద్ధమాయ మలినమాయ కలిసిమిశ్రమాయయై రజోగుణముచే ద్వంద్వ స్వరూపమైన ప్రపంచమాయను యెట్లనగా । ఆత్మానాత్మ, ప్రకృతి పురుషుడు క్షరమక్షరము, సత్తుచిత్తులు, జడాజడములు, జీవేశులు, నేనుమేనులు, దేహి దేహములు, జ్ఞానాజ్ఞానములు, సత్యాసత్యములు, పాపపుణ్యములు, సుఖ దుఃఖములు, ధర్మాధర్మములు, గురుశిష్యులు, కలిమిలేములు. తలి దండ్రులు, యెరుకమరుపులు. శుక్లశోణితములు, నీరాన్నములు. జనన మరణములు, ఆదిగాగల మానవులు, మృగములు, పక్షులు, జలచరములు క్రిమికీటకాది జంతుజాలములు నామరూప కులగోత్ర వర్ణాశ్రమ ధర్మములు యను యభిమానములుగల ప్రపంచమాయెను.

కందార్థం॥ ఎరుకే దేహేంద్రియములు । యెరుకే వర్ణాశ్రమములు ।
యెరుకే శృతులుౘ । యెరుకే నీవును నేనును । యెరుకే
సతిసోదరా దు లెరుగుమీవత్సా॥ నేదీర్చెదా నిదుగోసీయిచ్చా॥
హరిహరబ్రహ్మాదిసురనరగిరిసరి । తరుమృగముఖ చరా
చరమూలు యెరుకాని । యెరుగుమువత్సా ॥ యనియు.

కందార్థః॥ యెరుకే విద్యావిద్యలు । యెరుకే ప్రణవంబునాద । మెరుకేక
ళయుః । యెరుకే బిందువు। సచ్చి త్తెరుకే । ఆనందమివినీ।
వెరుగు సద్బుద్ధీ ॥ నీనామాటలెరుకే నిబద్దీ ॥ యెరుకే నిర్గుణ
సగుణాలెరుకే యెరుకకు యంత । యెరుకో నేనిదియంత
యెరుకా జేసితి నీవి ॥ తైరుగూ సద్బుద్ధీ॥ యనియు

కందార్థః॥ యెరుకే యిహపర సౌఖ్యము । లెరుకే జ్ఞానంబు జ్ఞేయ ।
మెరుకేమోక్షం । బెరుకే భక్తివిరక్తులు । యెరుకే సంకల్ప
మివి ॥ నీవెరుగూ, సత్కీర్తీ ॥ యెక్కడి కౌరయెరుక
సంపూర్తీ॥ యెరుకేజీవుండీశుడెరుకే తదేకత । యెరుకే సర్వ
మునే గురైరిగీ ॥ దెల్పితి యీకీలెరుగూ సత్కీర్తీ॥ యనియు

భాగవత కృష్ణ దేశికులవారు సెలవిచ్చినారు గనుక, పై జెప్పబడిన మాయ దేవత్వము, జడత్వము, జీవత్వము,యను, ఈ మూడు విధములుగా పరిణమించి ఆయాస్థానములయందు ఆయానామములచేత ప్రపంచమునందు గల మానవులకు ఆయా కార్యములను శిద్ధింపంజేసి ఆయా ఫలములను యిచ్చుచుండును. యిదికేవలము భ్రాంతిస్వరూపమే కదా ? అయినను

కం॥ నానావిద్యలచాతను। నానావిధ శాస్త్రతతుల । నను నమ్మట కై నేనే
రచించిపెట్టితి। నానాదేశములయందు। నరరూపమునః। యనియు,

కం॥ కావేటి కాలువలవలె। నావల్లనే కల్పనౌను। నానా విద్యల్। ఈ విశ్వ
మందు, విశ్వము। నావెంటనే వచ్చు పోవు నావలెను సుమీ యనియు.

కం॥ వినుభాష్యములను త్రాళ్లను । జనములు నను గట్టియుంచ జనక
నిలుతునాచనుదొత్తు నాకునేనై । గనుకనె నను నమ్మరెపుడు। ఘనుల
గువారల్॥

చూచితిరా, ఈ పద్యములలో మాయ తనరహస్యమును తనంతట తానే వెలిబుచ్చుకొనుచున్నట్లు పెద్దలు వక్కాణించుచున్నారు.

కల్పించుకొనుచు మతాభిమానములనే త్రాళ్లచేత కట్టుబడినవారలు, కర్మ కాండ ననుసరించినవారలు భ్రాంతిగలవారలేకదా ? కొందరు పుష్పములచే ప్రతిమార్చనచేయువారలు, మనస్సుచే మంత్రోపాసనచేయువారలు, మాలలు చేతబూని జపములు చేయువారలు, దేవతాదర్శనము కోరి తపస్సుచేయు వారలు, యంత్ర తంత్ర మంత్రములచే చిత్రవిచిత్రములైన ఇంద్రమహేంద్ర జాల విద్యలుచూపువారలు, భూదానగోదాన సువర్ణదాన యజ్ఞ యాగములు చేసి ఇంద్రభోగములను గోరువారలు, తీర్థయాత్రలుదిరిగి పుణ్యమునుగోరు వారలు సంధ్యావందనాది క్రియలు సలుపు వారలు వీరందరు వుపాసన కాండననుసరించినవారలు భ్రాంతికలవారలే కదా? సన్యాసులు యతీశ్వరులు దండీ, మహదండీ, హంస, పరమహంస, అవధూత వీరందరు వైరాగ్యమను దీక్షనుబూని ప్రపంచవాసనదగల కూడదని కాషాయములుధరించి తలలు గొరిగించుకొని కచ్చలుబిగియించి కొండలు వనములు దేవాలయములు నివాసస్థలములుగా నిర్ణయించుకొని ఆహారనేమములుబూని ప్రపంచమునందు తిరుగుచున్నారు "అహింసోపరమో ధర్మం । పరోపకారంమిదంశరీరం ।" యనువారలు నపాపంనపుణ్యంయని తమయిచ్ఛాప్రకారం ప్రవర్తించేవారలు వీరందరు హటయోగకాండ ననుసరించినవారలు, భ్రాంతిగలవారలేకదా ? మరికొందరు ఆకాశము, వాయువు, అగ్ని జలం, పృథ్వి, సాంఖ్యముచేత గుణములను శక్తిని కనిపెట్టి వాటిని ఇరువైఅయిదులుగావిభజించి వాటి గుణములను శక్తినికనిపెట్టి తిరిగి వకటితోనొకటి వ్యతిరేకముగా మిశ్రపరచి వాటిగుణములను శక్తులను, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను కనిపెట్టి ప్రకృతిశాస్త్రము పదార్థవిజ్ఞానశాస్త్రము, శారీరశాస్త్రము, వైద్యశాస్త్రము, సంగీతశాస్త్రము యనుశాస్త్రములను, వ్రాసినవారలు వీరందరు విద్యకాండ ననుసరించినవారలు, భ్రాంతిగలవారలేకదా? మరికొందరు పంచభూతములను సాంఖ్యముచేత జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, ప్రాణేంద్రియములు విషయేంద్రియములు, అంతరేంద్రియములు, యిరువై అయిదు తత్వములుగ యేర్పరచి శరీరములు, అవస్తలు, స్థానములు వ్యవహారములు వేరువేరుగా విమర్శించివాటిలోని మనస్సు, లక్ష్యము, శ్వాస, యీ మూటిచే ఖేచరీ, భూచరీ, మధ్యమ, షణ్ముఖి, శాంభవి, పంచముద్రలను రేచకపూరకముల ద్వారా

సాధించి స్వరశాస్త్రము, జ్యోతిశాస్త్రములను వ్రాసినవారలు వీరందరు భూతభవిష్యద్వర్తమానకాలముల నెరుగువారలు, భ్రాంతికలవారలేకదా? మరికొందరు తారకసిద్ధిని పొందగోరి, రేచక, పూరక, కుంభకములద్వారా, అధికాభ్యాసము జేసినవారలై, అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వములను అష్టసిద్ధులనుజెంది ప్రపంచమును వశపరచుకొని ఘనత వహించిన మహాత్ములు, వీరందరు జ్ఞానకాండననుసరించిన వారలు, భ్రాంతిగలవారలేకదా? మరికొందరు అహంబ్రహ్మాస్మి, అయమాత్మాబ్రహ్మం, తత్వమసీబ్రంహ్మం, ప్రజ్ఞానం బ్రంహంబను మహావాక్యములను ప్రమాణముగా తీసుకొని బ్రహ్మమందైక్యమునుగోరి శిరస్సునందు అష్టదళపద్మమున, శ్లో॥ మద్యేవైరాగ్యే । కేసరే జాగ్రత । కర్ణికాయాం స్వప్న । లింగేసుషుప్తి । పద్మత్యాగేతురీయః । యను ప్రమాణము ననుసరించి మనస్సు, లక్ష్యము, శ్వాస, సహస్రారమునందు మగ్నతపరచెదరు, దీనినే అమనస్కమనియు, సమాధియనియు నిర్నిద్రయని యందురు. శివజీవైక్యమనియు స్వస్వరూపసంధానమనియు ఈ స్థితి కుదిరినవారలకు జననమరణములు లేవనియందురు వీరందరు శుద్ధజ్ఞానకాండననుసరించినవారలు భ్రాంతిగలవారలేకదా? అయితే ఖర్మకాండ ననుసరించినవారలు, ఉపాసనకాండ ననుసరించినవారలు, వైరాగ్యకాండ ననుసరించినవారలు, విద్యాకాండ ననుసరించినవారలు, జ్ఞానకాండ ననుసరించినవారలు, శుద్ధజ్ఞానకాండ ననుసరించినవారలు అనగా ద్వైతాద్వైత, విసిష్టాద్వైత, శాక్తేయ, గాణపత్య, శైవ, సౌర, జైన, బౌద్ధ, కుటీచక, కాపాలిక, మహమ్మదీయ, క్రైస్తవ, వైదీకప్రతిమార్చన, మంత్రోపాసన, ఉపతప, దానధర్మ, యజ్ఞయాగ, సంధ్యావందన, సన్యాస, యతీశ్వర, దండీ, మహాదండీ, హంస, పరమహంస, అవధూత, సాంఖ్య, తారక, ముద్ర, యోగ, అమనస్కమాదిగాగల సాధనలయందు ప్రఖ్యాతినిగాంచినవారలు, వీరందరు త్రిగుణాత్మికమైన మాయాబ్రహ్మము ననుసరించిన వారలేకాని మాయాతీతమైన పరబ్రహ్మమును గురించి ప్రయత్నించినవారుకారు. అయితే ఋషులు, మహాత్ములు, పెద్దలు అనేక గ్రంధములయందు చెప్పబడిన రీతిగా కష్టములు పడినదంతయు వృధాయైపోయినదాయని శంకచేయవచ్చును, మంచిది,

వృధాయెన్నటికినిగాదు. వారువారు మాయాకల్పితములైన అనేక మార్గముల ననుసరించి కష్టముచే సిద్ధిని పొందినందులకుగాను తత్ఫలము లను పొందగలరు. యెట్లనగా, యజ్ఞయాగాది క్రతువులచేత సాలోక్య పదవియు సాంఖ్యముచేత సామీప్యపదవియు, తారకముచేత సారూప్య పదవియు, అమనస్కముచేత సాయుజ్యపదవియు ఇంకా వారువారు వారి వారి కష్టములకు తగిన ఫలములకు పొందగలరు (అనగా) మంచి జన్మకు రాగలరేకాని, జనన మరణములులేని పదవిని పొందలేరని నా వుద్దేశ్యము. ఈ మంచి జన్మలభ్యమునకే పరమపదవియని, మోక్షమని, ముక్తియని వాడుకుందురు. ఇందులో సుకర్మచేసినవాడు పారమార్ధికుడనియు, దుష్కర్మ చేసినవాడు ప్రపంచీకుడనియు ఎన్నబడుదురు, అదియెట్లనగా, జ్ఞానముచే శుద్ధమనస్సుగలిగి ఊర్ధ్వముఖవ్యాప్తియై వైరాగ్యము ననుసరించి అభి మానమునుత్యజించి నేమములుబూని మోక్షమే కావలెనను యిచ్ఛగలవాడు పారమార్ధికుడనియు, అజ్ఞానముతో కూడుకొని మలిన మనస్సుగలవాడై అధోముఖవ్యాప్తమై కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాది షడ్గుణ ములు గలిగి ధనీషణ, దారీషణ, పుత్రీషణములను ఈ షణత్రయములకు జిక్కి నామ, రూప, కుల, గోత్ర, వర్ణాశ్రమ, ధర్మములను అభిమానము లకు కట్టుబడి సంసారమనే బంధమున తగులుకొనినవాడు ప్రపంచీకుడన బడును. సుకర్మజేసినవాడు సుఖజీవనముగాను, దుష్కర్మ చేసినవాడు కష్టజీవనముగాను పుట్టగలరు, గనుకనే వీరందరు జనన మరణములుగల వారిని గట్టిగా చెప్పవలసివచ్చెను (అనగా) భ్రాంతి గలవారలేకాని భ్రాంతి రహితులుకారు.

శ్లో॥ కార్యాకారణ విరాహిత్యం । అచలోయం సనాతనః ॥ అని ప్రమాణము గలదు. (శివోహం) యనిన కారణము. (జీవోహం) యనిన కార్యము. ఈ రెండు మాయనే, ఈ రెండు అహంకారములే అహంకారము నశించిన వారు భ్రాంతి రహితమైన మార్గమును తెలుసుకొనగలరు.

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమేణోపాసకోజనః ।
భ్రమేణీశ్వరభావత్వం । భ్రమమూల మిదంజగత్ ॥ అనియు,

కం॥ కర్మమునబుట్టు జంతువు । కర్మమునను వృద్ధిబొందు ।
కర్మమునజెడుణ । కర్మము జనులకు దైవము । కర్మము ।
సుఖదుఃఖములకు । కారణమధిపా । యనియు,

ఈ శ్లోకములో సర్వంభ్రమ, భ్రమవల్లనే జన్మము కలుగుచున్న దనియు భావము. భ్రమయనిన, కర్మయనిన, వాసనయనిన, భ్రాంతియనిన వకటే. మాటలబేధము అయితే శ్లోకభావమును పద్యభావమునుబట్టి మోక్షమునకు యేమికావలయునోయని విచారించగాఁ (భ్రమమూలం మిదంజగత్) యను వాక్యమునకు (భ్రమరహితం మిదం మోక్షం) యను వాక్యమును (కర్మమునబుట్టు జంతువు) అను వాక్యమునకు గీ॥ కర్మరహితంబైన ముక్తి । యను వాక్యము కావలసినట్టుగా అర్థము స్ఫురించుచున్నదికదా ? జనన మరణ రహితమైన మోక్షమునకు భ్రాంతిరహితమే కావలసినదిగా దృఢపడుచున్నది. ఈవిచారణకు యే వుపనిషత్తులు, శృతులు, శ్లోకములు, పద్యములు అధారముగా తీసుకుంటిమో వాటి అర్థము పైవారలు గ్రహించక పోయినారాయను సందేహము గలుగవచ్చును. మంచిది, శాస్త్రమునకు ఉపమానప్రమాణము; శబ్దప్రమాణము, సందేహప్రమాణము, ప్రత్యక్షప్రమాణము అని నాలుగు ప్రమాణములుగలవు. ఉపమాన ప్రమాణమనగా విగ్రహారాధనలు సల్పడము, శబ్దప్రమాణమనగా మంత్రోపాసన జేయడము, సందేహప్రమాణమనగా యోగాభ్యాసము జేయడము, ప్రత్యక్షప్రమాణమనగా ఉన్నదున్నట్లుగా ప్రత్యక్షముగా తెలుసుకోవడము ఈ నాలుగుప్రమాణములలో పైవారలు మొదటి మూడుప్రమాణములలోని వారలేకాని, ప్రత్యక్షప్రమాణము తెలిసినవారలుకారు, గనుకనే భ్రాంతిగలవారలని దృఢముగా చెప్పవలసివచ్చినది. ప్రత్యక్షప్రమాణము దెలియనంతవరకు యెంతటివారికైనను భ్రాంతిరహితముకాదని నా నమ్మకము గనుక ఉన్నదున్నట్లు నిజము తెలసినవారలు, శృతులు, శ్లోకములు, ఉపనిషత్తులు, పద్యములకు చెప్పిన, అర్థమునకును పైమూడు ప్రమాణములలో వున్నవారలు చెప్పిన యర్థమునకును, చాలావ్యత్యాసముగానుండును. శ్లోకములు, శృతులు, ఉపనిషత్తులు, పద్యములు, గ్రంధములు, ప్రపంచము నందు వేలువేలుగా

నున్నవి, ఇందులో నిజముగ్రహించిన వారు చెప్పినవివున్నవి, నిజము తెలియని వారు చెప్పినవి కూడా వున్నవి, అది యెట్లనగా, సత్యమై, నిత్యమై, కేవలంబై, నిరాకారమై, సచ్చిదానంద రూపాత్మచైతన్యమై, యని చెప్పినారు. చూచితిరా ? పై నాలుగు పదములు పరమార్ధమునకు పోలినవి ఐదవపదము మాయకుపోలినది. ఇదేకాక యెవరినైనను దేవుడు యెటువంటి వాడని ప్రశ్నించగా,

కం॥ జనులనిరిదేవుడెవరికి । కనరాడని నామరూప । కర్మ
జననముల్ । గన నతనికిలేవని,

యందురు, నిరాకారం, నిర్వికారం, నిరంజనం, నిర్గుణంబని యందురు, అనగా, ఆకారములేదు, వికారములేదు, గుణములేదు, యని అర్ధంబగుచున్నది, అయితే ఈ జగత్తును యెవరుపుట్టించిరి యని ప్రశ్నించగా । దేవుడు తన సంకల్పము వలన మాయను పుట్టించి ఆ మాయకు తనయొక్క సత్తా కొంతనిచ్చి మాయను తనకు సహాయముగా వుంచుకొని జగత్తును పుట్టించెనని చెప్పుదురు, చూచితిరా ? యీ మాటలు యెంతవిపరీతములుగానున్నవో, నిరాకారమనగా దేహములేనివాడు దేహమేలేనప్పుడు కర్మేంద్రియములు లేవు. అంతరేంద్రియములు అంతకులేవుకదా ? దేవుడు, మాయను ఏ యింద్రియ సంకల్పము వలన పుట్టించెను అట్లనుటకుయిచ్చట యేమైన అవకాశముగలదా ? వారలజ్ఞానము, వారలతెలివి తేటలు, ఈ లాగుననున్నవి గనుక నిజము తెలియని వారలు చెప్పిన గ్రంధములు, శ్లోకములు, ఉపనిషత్తులు, పద్యములు సర్వం, ఇవ్విధముగానే వుండగలవు నిజముతెలిసినవారలశ్లోకములు, శృతులు, ఉపనిషత్తులు, పద్యములుసర్వం నిష్కళంకముగా వుండగలవు.

శ్లో॥ నిరాలంబాయనిత్యాయ । నిర్మలాయ నిరంజన ।
నిత్యశుద్ధాయబుద్ధాయ । వస్తుమద్రహితం నమః ॥

అనునట్లు నిజము తెలిసినవారు చెప్పిన శ్లోకములుగాని, శృతులుగాని, ఉపనిషత్తులుగాని, పద్యములుగాని యీ ప్రకారం వుండవచ్చును

ఇందులోయేమాత్రం సంశయం లేదని నాయొక్క నమ్మకము। నిజము తెలిసిన వారెవ్వరోయని శంకవుండవచ్చును । ఇదుగో శ్రీమహావిష్ణు, సూర్యుడు, యాజ్ఞ్యవల్క్య మహాఋషి, జనకచక్రవర్తి, శ్రీ శుకులు, సాందీపులు, శ్రీ కృష్ణ పరమాత్ములు, అర్జునుడు, శ్రీధరస్వామి, శ్రీ శివరామదిక్షితులు, శ్రీ భాగవతుల కృష్ణప్రభువులు వీరలు చెప్పిన శ్లోకములు, శృతులు, ఉపనిషత్తులు, పద్యములు, గ్రందములు, కేవలం నిర్మలంగా వుండును. అవి యెక్కువగా తీసుకొని చెప్పవలెననిగాని, ఇక్కడ ఉదహరించవలెనని గాని వుద్దేశములేదు. ఏవియైనను సూక్ష్మముగా చెప్పవలెనని తలచుకున్నాను గీ॥ భక్తిగలుగుకూడు పట్టెడైననుచాలు(యనియు) గీ॥ నిక్కమైనటువంటి నీలమొక్కటెచాలు । తళుకు బెళుకురాళ్ళు తట్టడేల। చదువ పద్యమరయ చాలదావకటైన (యని) లోకోక్తిగలదు. విజ్ఞానము, సూక్ష్మబుద్ధి, సూక్ష్మ గ్రాహ్యముగలవానికి వకమాటచాలదా ? వేయి మాటలేల. "నిజముతెలిసిన వారిని యే ప్రశ్న యడిగినను చక్కగా సమాధానము చెప్పగలరు వారికి కోపముగాని అహంకారముగాని వుండదు. నిజముతెలియనివారిని యెవరైన వక ప్రశ్న యడిగితే సమాధానము చక్కగాచెప్పరు. సమాధానం సరిపోలేదండి యని అంటే వారికి మహాతీవ్రమైన కోపము, అహంకారమునకు లెఖ్ఖనేలేదు కావలసివుంటే మీరు పరీక్షజేసి చూచుకునవచ్చును." ఇదిగాకను కొందరు వేదాంతులు దేహిసత్యం, దేహమసత్యంబని వాదములు సల్పుచున్నారు. అయితే కరచరణాది అంగములు గలిగి మొద్దువలె కనబడుచున్నదే దేహము, సర్వమును గుర్తెరుగుచు మంచి చెడ్డలను గ్రహించుచున్నదే, దేహి అనగా (తెలివి) దేహినివిడచి దేహముగాని, దేహమువిడచి దేహిగాని పనులు చేయగలవా ? రెండొక్కటైనయడల ఏ పనులైనగాని చేయగలవు ఇందులో వకటి సత్యం వకటి అసత్యమెట్లు, రెండునత్యమైన కావలసినది లేక రెండు అసత్యమైన కావలసినది కాని, సత్యాసత్యములుగా వుండనేరవు (గుడమేమధురము, మధురమేగుడము) బెల్లములేక తీపిగాని, తీపిలేకబెల్లము గాని వుండబడదు ఈ విధముగానే దేహిదేహములు రెండు వక్కటే, ఉ॥ వకశర్కరబొమ్మ, దాని అంగుష్టము మొదలుశిరః, పర్యంతం, తీపిగా వుండగలదుగాని సగము తీపి, సగము చేదుగా యే కాలమందైె

నను వుండనేరదు ? చూచితిరా నిజము తెలియనివారి విచారణకూడా యీ లాగుననే వుండగలదు. అయితే వకమనిషి మృతినొందినపుడు శవము అచ్చట పడి యున్నదిగాని పలుకరించితే మాట్లాడదు దేహి వెళ్ళిపోయిన దేమో దేహము మాత్రము పడివున్నదిగనుక మాకు రెండుగా తోచబడెను యనిసందేహించవచ్చును. మంచిది దేహమును విడచి దేహిలేచిపోవుచుండగా యెవ్వరున్ను చూడలేదు, అది యెక్కడను పోలేదు, అది అందులోనే మగ్నతనుపొందినది, యెట్లనగా, వకల్యాంపు, పై అద్దము మొదలైనవి దేహ మనుకుందము లోపల ప్రకాశరూపముగా వెలుగుచున్నదే. దేహియను కుందము, ఆప్రకాశమును మనముచేతితో విసరినప్పుడు, చల్లారును. ఆజ్యోతి, ల్యాంపువిడచి పైకిగాని యింక యేవంకగాని లేచిపోవుచుండగా చూచితిరా ? అదియెక్కడికిపోలేదు అందులోనేమగ్నమైనది, గనుక దేహమునుజూచు కన్నులు, దేహమునకు వేరులేవు, కాని వేరుగావున్నట్లు తోచుచున్నందున సందేహమునకు గారణమగుచున్నది, దేహిదేహములు మాయాకల్పితము లైన అసత్యములేకాని, సత్యము కాదు, మాయాఅసత్యమైనది అశాశ్విత మైనదైనను దానియందు వ్యవహారిక సత్యత్వము వున్నదని చెప్పినారు వ్యవహారికసత్యమనగా యెటువంటిదోయని శంకచేయవచ్చును, అది యేలాగనగా,

నూరుగురుదొంగలు ఏకమై వక పట్టణములో సాహుకారియింటికి బందిపోటు వేయుటకుగాను వక నాటిరాత్రివెళ్ళి సాహుకారియింటి తలుపులు తాళాలు, బ్రద్దలుకొట్టి. లోపలికిపోయి యింటిలోనున్నవారలను అనేక విధములబాధించి హింసించి వెండి బంగారం, మొదలైన వస్తువులను మూటలుకట్టుకొని బైలుదేరి వకకొండలో చేరినారు తర్వాతవారిచే అప హరింపబడిన ధనమును, విభాగించు కునదలచి వారిలో నొకనిముందు ఆ ధనమంత యునిచినారు. అంతలో వకదొంగ ఓరామన్నా మనము తెచ్చినసొత్తు అందరికి సమభాగముగా పంచగలవాడవనియు, బుద్ధిమంతుడ వనియు, పెద్దవాడవనియు నీ ముందుంచినాము అనగానే, ఓ యంకన్నా యంతమాటాడితివి నేను పిల్లలు కలవాడను వకరిని అన్యాయముగాని

మోసముగాని చేయువాడనుగాను అందరికి న్యాయముగా పంచగలనని జవాబుచెప్పెను. చూచితిరా ఆ రామన్న మాటలలో యెంతసత్యమున్నదో, వారు దొంగలైనను వారి వ్యవహారము కేవల దుర్మార్గమైనను ఆ సొత్తు అన్యాయముగా తెచ్చినదైనను వారు విభాగించుకొను సమయమందు, న్యాయము సత్యము కావలసివచ్చినది. ఆ సమయమునందు వారిలో న్యాయము సత్యము లేనియడల వారల వ్యవహారమునకు భంగము తప్పక వాటిల్లును దీనినే వ్యవహారిక సత్యత్వమని చెప్పవలసివచ్చినది. ఇదే అసత్యములో సత్యము ప్రపంచము అశాశ్వితము అసత్యమైనదని మన యిష్టప్రకారము ప్రవర్తించుటకు అవకాశములేదు. జాగ్రత. ఇదుగో మనమే కాదు, చక్రవర్తులు, మహారాజులు, జమీందారులు, ధనవంతులు, వర్తకులు మొదలైనవారందరు వ్యవహారిక సత్యత్వము గలవారలే గనుక మన కందరికి మూలం, మాయ, దానికి యెటువంటిఅధికారము యెటువంటి ప్రజ్ఞ గలదో అటువంటిదే మన అందరియందు వుండగలదుగాని ఇతరము వుండ గలదా, శ్లో॥ యధారాజ తధా ప్రజాః। యనువాక్యము ఇచ్చట సరిపోవు చున్నదికదా ? సరేకాని । పారమార్ధమునకు ప్రపంచమునకు సంబంధము కలదా ? యను ప్రశ్నకు సమాధానము యింతవరకు రాలేదు చెప్పవలసిన దని యడుగవచ్చును । మంచిది. మాయాతీతమైనది పరమార్ధము, మాయా సంబంధమైనది ప్రపంచము గనుక పరమార్ధమునకు ప్రపంచమునకు ఏ మాత్రము సంబంధమువున్నట్లు యెక్కడను కనబడ లేదు. ప్రపంచమునకు సంబంధములేని పరమార్ధము వుండిననేమి ఫలములేకున్ననేమిఫలము అని శంకచేయవచ్చును కాని ప్రపంచమునకు (అనగా) మనకు, జనన మరణ రహితమైన మోక్షము కావలసిన సమయమునందు మనమే పర మార్ధమును ఆశ్రయింపవలసి వచ్చుచున్నదికాని నన్నాశ్రయించుమని పర మార్ధము యేకాలమందునను కోరదు ఆశ్రయించితే మాత్రము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేనటువంటి పరమార్ధము, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములుగల మనకు యేవిధముగా సహాయముజేయును యని సందేహించ వచ్చును. విషము మనల చంపవలెనను సంకల్పము దానికేకాలమందునను

లేదు. విషముద్రావి చావవలెనను సంకల్పమనకు యేకాలమందు ననురాదు. కాని మనమొకప్పుడు ప్రాణత్యాగము జేసుకోవలెనని సంకల్పము గలిగిననాడు మాత్రము విషమును తప్పక ఆశ్రయింపవలసి వచ్చుచున్నది. ఈ తీరుననే మనకు జన్మరహితమైన మోక్షము కావలెనను ఇచ్ఛగలిగిన నాడు, పరమార్ధమును ఆశ్రయించవలశి వచ్చుచున్నదని నా వుద్దేశ్యము, లేనియడల, దాని అవసరము దీనికిలేదు, దీని అవసరము దానికిలేదు, ఇందులోయేమైన సంశయమా? లేదుగదా? ఈ విచారణచాలా బాగుగనే వున్నదికాని, నిరీశ్వరవాదమో లేక సూన్యవాదమోయని కొందరు సందేహించుచుండవచ్చును. నిరీశ్వరవాదమనగా దేవుడులేడనే వాదము, సూన్యవాదమనగా: యేమిలేదనేవాదము. దేవుడులేడనే విచారణ మనమింత వరకు చేయనేలేదు దేవుడువున్నాడు. మాయకు అతీతమైనవాడు. భ్రాంతి రహితమైన మోక్షము వున్నదని నిశ్చయించినాము, నిరీశ్వరవాదమెట్లైనది? కాదుగదా? మరియు ఉన్నట్టుగాకను పడుచుండి, మరివక కాలమందు కనపడక పోవుదానిని సూన్యమనియు మిధ్యయనియు మాయయనియు, చెప్పవలెకాని యేమీలేని దేవునికి శూన్యమనేపేరురాదు; (అదియెట్లనగా) మనతాతలు ముత్తాతలు వకకాలమందు మనవలెనేవుండిరికదా? యిప్పుడు వారినిచూడవలెనని తలంచితె వున్నారా? లేరు, వారిని శూన్యమనియు, మిద్యయనియు, మాయయనియు చెప్పనగును. మనతాతముత్తాతలవలె మనము కూడ వకకాలమునకు లేకపోవువారముగనుక, మనమేశూన్యముకాని, పరమార్థము అటువంటిదికాదు శ్రీసద్గురుకరుణ గలిగిన జ్ఞానులకు సర్వకాల సర్వావస్థలయందును శాశ్వితమై, సత్యమైయున్నది.

కం॥ కనుమూసిన కనుదెరచిన। కనుమరుగింతైన లేక। కానంబడు॥

యనిఉపనిషద్వాక్యముగలదు, చూడండి, శూన్యమనుటకు యిచ్చటయేమైనఅవకాముశగలదా, మంచిది, లోకములో, శివుడు, విష్ణు, రాముడు, శక్తిమొదలైన నామములయందు భక్తిగలిగిసేవించుచున్నారుగదా? వారిని యేకాలమందైనను ప్రత్యక్షముగాచూచిరా? వకకాలమందు కనబడివుండ

వచ్చును, అప్పుడేకనబడి, చప్పున అదృశ్యమై పోయినారేమోకాని సర్వ కాలము సర్వావస్థలయందు కనుపడుచుండిరా ? జ్ఞప్తికివచ్చినప్పుడు బుద్ధికి స్పురించుచుండిరేమోగాని, కన్నులకగుపడుచుండిరా ? లేదుగదా ? శూన్యమేదో మీరే ఆలోచించవలశినది, లోకులవాదమే శూన్యవాదమాయె, అట్లంటిమా, తిట్టవస్తారు లేక కొట్టవస్తారు, శ్లో॥ సత్యంజనవిరోధాయ। అసత్యంజనరంజనం॥ యని పెద్దలువచించినారు లోకులకు, సత్యముచెప్పిన యడల కోపము వచ్చుచున్నది గనుక అసత్యమేచెప్పవలెను.

శ్లో॥ కర్మపూరితదేహానాం। ధర్మశాస్త్రమరోచకం॥
చర్మఖండనబక్షాణాం। స్వానంఘ్మృతమరోచకం॥

యనిపెద్దలుశలవిచ్చినారు అయితే ఈ ప్రకారం, విచారణచేసే వారలు ఈకాలమందుగాని ఇంతకులోగాని వున్నారోలేదో మాకువకరైనను కనపడరు అనిమీకు సందేహముగలుగవచ్చును. వినవలశినది। అప్పటికిన్ని ఇప్పటికిన్ని ఎప్పటికిన్ని ఉన్నారువారు గుర్తులకుచిక్కే వారుకారు, సన్యాసులు, యతీశ్వరులు, స్వాములు, దండిమహాదండి మొదలైనవారలవలె వుండేవారుకారు "గురువులమనేపేరు పెట్టుకొని వేషములుధరించి పేరు ప్రతిష్టలకై వూరూరుతిరిగేవారుకారు. వేదాంతులమని లేనిపోని వాదములు కల్పించుకొని తర్కవితర్కములు సల్పేవారుకారు అహంకారరహితమైన నడతగలవారు, సాధుహృదయులు, రాజయోగమవలంభించి సంసారమునం దేయున్నారు, ఈకలియుగమునందేగాక కృతయుగ, త్రేతాయుగ, ద్వాపార యుగములయందును వున్నారు. వారినామధేయములను నాకు తెలిసినంత వరకు వివరించగలనువినవలసినది,శ్రీమహావిష్ణు, సూర్యుడు,యాజ్ఞ్యవల్క్య మహాఋషి, జనకచక్రవర్తి, వసిష్టమహాఋషి, శ్రీరామచంద్రుడు, శ్రీశుకుల వారు, సాందీపమహాఋషి శ్రీకృష్ణులు,అర్జునుడు, ఉద్దవుడు యింకాఅనేకులు గలరు వీరందరును రాజయోగమునను సరించియున్నవారలే," ఈకలియుగ మందు శ్రీధరస్వామి, వేమన్న, సధానందయోగి శ్రీశివరామదీక్షితులవారు, నారాయణపురం నైజాం॥ అప్పారావు మంత్రిగారు కంబాలూరు, పరశు

రామసీతారామయ్యగారు, నరసయ్యగారు యెట్టిగొండ పాళెం, భాగవతుల కష్ణదాసుగారు హైద్రాబాదు, ఫీల్ఖానలక్ష్మణరావుగారు బేగంపేట, ఫీల్ఖాన శంకరరావుగారు నాంపల్లి, హైద్రాబాదు, ఆదిరాజుతిర్మలరావుగారు పరిటాల మాధవరాజవెంకటప్పారావుగారు ఉయ్యందలతాళ్లూరు, కాయిదాలగూడెం రామన్నగారు హైద్రాబాదు, మంగోలువెంకటనరసయ్యగారు అంబారిపేట, హైద్రాబాదు, మరుధూరి గోపాలచార్యులు హైద్రాబాదు, మాదిరాజుసూర్యా రావుగారు ఫీల్ఖాన హైద్రాబాదు, పగడాల వెంకటేశ్వరులవారు చిత్తూరు నారంఅనంతస్వామిగారు శికింద్రాబాదు, వరదారామమూర్తిగారు అనకాపల్లి ముద్దిపీడిజమలాపురిగారు కొండపల్లి, చింతాడసూర్యనారాయణచార్లు బెజవాడ, చింతాడచిట్టెయాచార్లు బందరు, రొంగలసన్యాసయ్యగారు విజయన గరం, వెంపటినరసింహ్మముగారు విజయనగరం, గోవిందవర్ఝుల వెంకటరా మయ్యగారు అమలాపురం, తొగిటినరసింహ్మాచార్లుగారు, వరంగల్, బొంది లిరామశింగుగారు బెజవాడ, బండిరామస్వామిగారు తణుకు, గుండాభూమన్న గారు శికింద్రాబాదు, హకీంఅనంతరామశర్మగారు, హైద్రాబాదు, అబ్బుగారి వీరయ్యగారు శికింద్రాబాదు, అరిగెరామస్వామిగారు శికింద్రాబాదు, కేసన వీరయ్యగారు కొవ్వూరు, మల్లెలవెంకటసుబ్బయ్యగారు యిబ్రాహింపట్నం తాలుకాబెజవాడ, యింకాఅనేకులుగలరు వీరందరికి శిష్యకోటిగలదు వీరలు దేశిక చక్రవర్తులైన సద్గురువుల నాశ్రయించి,

కం॥ తనుమనధనములుగురునకు । వినయంబునధారబోసి। వేడ్కగు
రునిచే । అనువైనబోధవడసిన । ఘనమతిమంతులు ॥

సమరస ప్రజ్ఞగలవారలు (జనులవలె జరుపుపనులను) అనుశృతి నాశ్రయించి, అందరివలెనే నడుచుకొనగలిగిన నేర్పుగలవారలు.

కం॥ జలమునెడబాయనొల్లని । జలచరములతీవిబూని।
సచ్ఛిష్యుడు । హృజ్జలజంబనుపీఠముపై । నిలిపి
తరముమాని । గురువునేగొల్చు ॥

యను ఉపనిషద్ప్రమాణము ననుసరించి సర్వకాలము గురునామ స్మరణ దీక్షలుగలవారలై నిందాస్తుతులకు, చెవియొగ్గనివారలు ఇటువంటి

వారలే నిజము తెలిసినవారలు, భ్రాంతిరహితమైనవారలని నా నమ్మకము, భ్రాంతిరహితము కావలెనని చెప్పుచున్నారుకదా ? బొందిలో ప్రాణము వుండినంతవరకు భ్రాంతిరహితముకాదుగాని, ప్రాణముపోయిన తరువాత ఔనేమోయని కొందరికి సందేహము గలుగవచ్చును. చనిపోయిన వానికి మాత్రము భ్రాంతిరహితమైనదా ? కాలేదు, ప్రతిమనుజుడు చనిపోవుకాలమందు యేదోవక భ్రాంతియందు మగ్నుడై చావగలడుగాని పూతికెచావడని నా యొక్క నమ్మకము, అదికూడకాదు చావురాకముందే చావడమునకు భ్రాంతిరహితమనియందురు. అదియెట్లనగా, ఏ విధమైన విత్తనములనుకాని కొన్నివిత్తనములుతెచ్చి అందులో నుంచి కొద్దిగా విత్తనములను తీసికొని తప్తలోహకళాయిలోవేసిన, నవివేడియగును, అప్పుడు వాటిని బయటతీసి పచ్చి విత్తనములలో కలిపినయెడల అన్నియు, పచ్చివిత్తనములవలెనే యుండును. (అటువలెనే భ్రాంతిరహితులుకూడా జనులవలెనేయుందురు) కాని, అన్నియు భూమిలోనాటిన, పచ్చివిత్తనములు మొలకలెత్తగలవు. యేగినవిత్తనములు మొలకలెత్తునా ? యెత్తవు, యెందుకనగా మొలకలెత్తు యంకురము వేడిమిచే నశించిపోయినది గనుక, అందువల్ల మొలకలెత్తవు అదేవిధముగా, భ్రాంతియనే అంకురము నశించిపోవడమే, భ్రాంతిరహితము కాని, భ్రాంతిచే మనుష్యులు చనిపోయిన భ్రాంతిరహితమగునా ? కాదు, పచ్చివిత్తనములు మెలకలెత్తునట్లు, జననమరణ ప్రవాహమునం బడు చుందురు ఇదియునుగాక, పరస్త్రీని పట్టవలెననే యిచ్ఛగలవాడు జారుడు, పరధనమును పట్టవలెననే యిచ్ఛగలవాడుచోరుడు, పరరాజ్యమును, పట్ట వలెననే యిచ్ఛగలవాడు, శూరుడు, పరబ్రహ్మమును పట్టవలెననే యిచ్ఛ గలవాడు ధీరుడు, స్త్రీకి సంబంధించినవారెవరైన, నన్నుచూడగలరేమో, పట్టి కట్టి కొట్టగలరేమో, చంపగలరేమో, యనుభయము జారునికి, ధన వంతులు పట్టుకునగలరేమో, చెరశాలలో వేయించగలరేమో చంపగలరేమో యనుభీతిచోరునికి, శత్రులచేత చిక్కుకునగలనేమో అస్త్రశస్త్రంబులఘాత డపగలనేమో వారిచేచంపబడుదునేమో యనుదిగులు శూరునికి, గలిగిన యెడల, జారునికిపరస్త్రీ, చోరునికి పరధనము, శూరునికి పరరాజ్యము, స్వాధీనములుకావు అభయములులేనియెడల స్వాధీనములుగాగలవని నా

యొక్క నమ్మకము, యీ ముగ్గురు చచ్చియున్నవారలా ? బ్రతికియున్న వారలా ? ఆలోచించ వలసినది ఈ విధముగానే ధీరుడు సర్వత్యాగము గలవాడు గనుక నే(భ్రాంతిరహితుండని చెప్పవలసివచ్చెను, చచ్చిన తరువాత భ్రాంతిరహితముకాదు, బ్రతికివుండగనే భ్రాంతిరహితము కావలెనని వుద్దేశ్యనమ్మకము, "కొందరు ఉద్యోగాది వ్యవహార కష్టముల కోర్వలేక వేషములు వేసుకొని గురువులమని కొందరి శిష్యులను తమకులోబడిన వారినిగా జేసుకొని కొందరి స్త్రీలనుజేర్చుకొని రహస్యస్థానములు యేర్పాటు చేసుకొని (సర్వంఖల్విదంబ్రహ్మం బనుచు) వారలకు లేనిపోని మంత్రము లను కొన్నివుపదేశించి మనము భ్రాంతిరహితులము మనకు భేదమేలేదనుచు మత్తుపదార్థములను గ్రహించి, తినరానిపదార్థములను, తీర్థప్రసాద ములుగా పుచ్చుకొనుచు గురుపూజయని పేరుబెట్టి బుర్రకాయచేతబూని వారివారికి యిష్టమైనవికొన్ని, వచ్చిరానివికొన్ని పాటలుపాడుచు యెంతో భక్తిగలవారివలె నటించుచు మనమందరము గురుపుత్రులము మనకు పాప పుణ్యములులేవు యని, స్త్రీలు పురుషులుయేకమై, చేయరానిచేష్టలు జేయుచు కాలము గడుపుచుందురు, ఈ విధముగా ఇంకా అనేకులు అనేక మార్గములుగా లేనిపోనివెన్నో కల్పించుకొని ప్రవర్తించేవారలుగలరు వారిరహస్యములనెల్ల విస్తరించనలవికాదు" ఇటువంటి వారలదగ్గరకు మతాచార ధర్మముగా పూజసల్పువాడో లేక మాలచేతబూని జపముజేయువాడో లేక యేదోవక వ్రతముగలవాడో వచ్చినట్టయితే వానినిజూచి. (యే సాధననీకెందుకు। పీసానికిపనికిరాదు। యని యెవరోచెప్పినపద్యముజెప్పి వానిని అపహాస్యము చేయుదురు, తానుచెడినకోతీ వనమంతాజెరిచె) ననుసామెతగా, వారుజెడినదే కాక ఆ వచ్చినవానియందున్న దేదోభక్తి, దానియందు కూడా వానిని నిలువకుండా, చెరివివేయుచున్నారు, ఇదుగోవీరలే, ఉట్టికిలేక స్వర్గానికిలేక చెడిపోవువారలు

కం॥ అనుభవవేదాంతులమని । తినరానిపదార్థమె॥
ల్ల । తినుదుర్జనులర । కనబోకుము । యనియు,

కం॥ జిహ్వోప స్తవిషయము । లెవ్వీగలవో వాటివిడువ ।
లేనిగురువులఁ ।యెవ్వరుచేరికొలతురో । యివ్వసుధనువా

రుజడుదురు॥) యనియు పెద్దలుచెప్పియున్నారు గనుక, ఇటువంటి వారలను చేరినయడల ఉభయభ్రష్టుత్వము తప్పకగలుగగలదని నా వుద్దేశ్యము, మనము మొదటినుండి యింతవరకు, విచారణచేసిచూడగా ప్రపంచములో మోక్షమునుగురించి విచారణజేయుచున్న లోకుల విచారణ అంతయు శ్రోత్ర, త్వక్కు, చక్షు, ర్జిహ్మ, ఘ్రాణ, వాక్పాణిపాద, పాయూపస్థ మనస్సు,బుద్ధి, చిత్తము, అహంకారము, మొదలైన జ్ఞానేంద్రియకర్మేంద్రియ అంతరేంద్రియములను అనుసరించిన కర్మలుచేసిన వారేగాని, జ్ఞానముచే విచారణజేసినవారెవ్వరును కనుపడవేదు, జ్ఞానములో అజ్ఞానముకూడ వున్నది అట్లుగాక శుద్ధజ్ఞానముగలిగి దానిచే విమర్శజ్ఞానముగలిగి అపైన ప్రజ్ఞానముగలుగవలెను ప్రజ్ఞానము గలవాడే జననమరణరహితంబైన విచారణకు అర్హుండని నావుద్దేశ్యము. అయితేపైనజెప్పబడిన కర్మ కాండాది గాగలవారలు జ్ఞానములేనివారలేనా యని సందేహించవచ్చును, వారలకుగలిగినజ్ఞానము మిశ్రజ్ఞానముగాని శుద్ధజ్ఞానముగాదు, (యెట్లనగా) పైవారు స్థూల, సూక్ష్మ, కారణ, శరీరములకు సంబంధములగుకర్మలచేసిన వారేగాని మహాకారణశరీరసంబంధమైనవిగావు, ఈమహాకారణశరీరమునకే యెరుకయనియు, జ్ఞానమనియు, సాక్షియనియు, ద్రష్టయనియు యందురు మోక్షము మహాకారణశరీరమునకేగాని, స్థూల,సూక్ష్మ, కారణ, శరీరములకు గాదు, స్థూల,సూక్ష్మ,కారణ, శరీరముల కర్మలవలన ఉత్తమజన్మ ప్రాప్తి గలుగును: మహాకారణశరీరకర్మ(అనగా) జ్ఞానముచే జేయబడిన విచారణ, ఇందులో రజోగుణ తమోగుణముల ననుసరించినది కాకుండా, కేవలము సత్వగుణముననుసరించి విచారణచేసినయడల జనన మరణరహితంబగు మోక్షముగలుగగలదని నాయొక్కనమ్మకము, గలదు గనుక,

కం॥ ఆగామీకథయట్లన । బాగుగవివరింతు చెవుల
వండువుగాగఁ । ఆగమనిగమోపనిషత్సా
గరమథితార్థమవల॥ సాంగోపాంగముగాఁ ॥

యను ఉపనిషద్ప్రమాణముననుసరించి ఆగమములు నిమగములు ఉపనిషత్తులను సముద్రముగాజేసి మర్ధించగా తేలినసారమును సద్గురుపులనాశ్రయించి యేమాత్రముకొరతలేకుండా, చక్కగాఉన్నదున్నట్లు, నిజముతెలుసుకోగలరని, నమ్ముచున్నాను అట్లుగాక.

కం॥ జపములుతపములుజేయుచు । విపరీతపుస్మరణజేయు
వేదాంతార్థం। బపరిమితంబుగజెప్పును । కపటా
త్ముడు శిష్యకోటి । గనిమెచ్చుకొరకు॥

యిటువంటిగురువులను చేరినయడల వారికివచ్చినవిద్యనే చెప్పగలరు గాని, వారికితెలియనివిద్య యేలాగుచెప్పగలరు (యధాగురు, తధా శిష్యా) గురువునకురాని విద్య శిష్యునకు యేలాగునచెప్పగలడు,

కం॥ ఇజ్గితమునెరిగిసద్గురు । పుంగవుచేనరుడు భుక్తి ।
ముక్తిక్రియలన్ । సంగాసంగముదెలసిన । శృంగారము,॥

యనిపెద్దలు చెప్పినారుగనుక గురువునువెదకిపట్టవలెను కనపడిన వారంతాగురువులుకారు,॥

కం॥ మానవుడుచేయబూనిన । దానినిలోతెరిగిచేయదగును॥

అనివున్నదిగనుక మనమొక కార్యమునకు దిగవలశినసమయమునందు దానికిన బంధించిన సందర్భాసందర్భములను చక్కగా విచారించి పూనుకోవలశినదేగాని, విచారణచేయక, పూనుకొనినయడల ఫలముగలుగదని నమ్మగలను, గనుక, బుద్ధి మంతులైనవారలు ఈవుపన్యాసమునందుగల అంశములను చక్కగా గ్రహించి యేమైన అపశబ్దములు వుండినయడల సుశబ్దములుగా భావింగలరనినమ్మి సద్గురుమూర్తులైన శ్రీసచ్చిదానంద

వెంకటేశ్వర దేసికప్రభువరుల పాదపద్మములకు సర్వకాలసర్వావస్థలయందు సాష్టాంగములర్పించుచున్నాడను॥



* ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః *

—* గద్య *—

ఇదిబృహద్వాసిష్టసిద్ధాంత నిర్ధారణులైన శ్రీశివరామదీక్షిత

అచలగురుపీఠ సాంప్రదాయకులును శ్రీసచ్చిదానంద

వెంకటేశ్వరస్వాములవారి

ప్రియశిష్యులగు

శ్రీభూమానంద హనుమంతరాజయోగిగారిచే

రచియింపబడిన

సందేహనివర్త్యోపన్యాసము

* సంపూర్ణము *

శ్రీ శ్రీ శ్రీ



* సర్వం శ్రీ సద్గురు చరణారా విందార్పణ మస్తు *




శ్రీ గురుభ్యోనమః

# అచలపరిపూర్ణ పరతత్త్వ కందార్థదరువులు

— శ్రీ భూమానంద హనుమంతదేశికేంద్రులవారిచే రచియింపబడినవి —

1 ధరలోపల మందిప్పల । వరనాగనయార్యసత్య । వాక్యపరునకున్ । మరియాశమాంబకుననే । హరువరమున బుట్టినట్టి ॥ హనుమయాఖ్యుడనూ । సాధుసజ్జన ఆశ్రితుడనూ ॥ అరయాగ వేంకటేశవధూత కృప చేత । పరిపూర్ణబోధనే బడసి ధన్యుడనైతి । హనుమయాఖ్యుడనూ । సాధుసజ్జన ఆశ్రితుడనూ ॥

2 బయలన వస్తువుయెట్టిది ? బయలన యెచ్చోటనుంది ? బయటనలోనా? బయలన అగుపడుచున్నద ? బయలని చెప్పుటకు నదియూ । బయల వూచుందా ? చెప్పకపోతె బయలుగాకుందా ? బయలు బయలు బయలు బయలు యనుచుబలికే? బయలూకుపై వేరే బయలున్నదాదెల్పు? బయ లావుచుందా ? చెప్పకపోతె బయలుకాకుందా ?

3 బంధము మోక్షములనియెడి । బిందుత్రయమేమిలేక । బీజములేకన్ । సందేహమేమిలేకను । అందముగను క్రిందమీదా అంతటాయుండూ ॥ అచలముయెపుడా తీతమైయుండూ ॥ వింతావింతగదోచె విశ్వములే కాను । సంతాతమొకరీతి సాక్షిలేకనుయుండూ ॥ అంతాటాయుండూ । అచలము యెపుడాతీతమైయుండూ ॥

4 అచలము యచలముయంటివి । అచలంబన యర్థమేమి ? యనుభవ మేమీ ? అచలము చలనముయగునా ? అచలము బ్రహ్మాండములకూ॥ ఆధారమగునా ? తెలియకనీవు । వాదించనగునా ? వచనరచనలచేత । వాగితేఫలమేమి । అచలముసాక్షాత్త ? అనుమాన మాదెల్పు ? ఆధార మగునా । తెలియకనీవు వాదించనగునా॥

5 శ్రీవేశరహిత మచలము । భావాభావములులేని । బయలే అచలం । కేవల యాత్మయె అచలము । స్థావరజంగములు లేని॥ సాక్షిరహితచలం । సాధనరహిత । మోక్షాతీతచలం । ఆవరణవిక్షేప ఆరోపరహితచలం । నీవునేననె భ్రాంతి నిరసనమే అచలం॥ సాక్షిరహితచలం । సాధనరహిత మోక్షాతీతచలం ॥

6 పరిపూర్ణమనగ నెట్టిది ? పరిపూర్ణము యెక్కడుంది? పలుకుటకగునా? పరిపూర్ణమనగ వస్తువ ? పరిపూర్ణంబనినదాన్ని । పరగజూచితివా ? చూచితెనీవు మరిగినిలచితివా ? పరికించివినజెప్పు పైమాటలకుసెల్ల । గురుపుత్రుడావైతె । గుట్టుదెలసియుంటె॥ పరగాచూచితివా । చూచి తెనీవు మరిగి నిలచితివా॥

7 పరిపూర్ణమనిన అచలము । యెరుకనగా యెరుకమరుపు । యెరిగెటి దన్నా । గురుతుగ రెంటిని యెరిగియు । యెరుగక యుంటేను చాలు॥ యెరుకుండదన్నా । మాట్లాడుటకు యేమిలేదన్నా॥ నిరతాము యీరీతి నిష్టజెందినయపుడే । మరణాజననములానె మాయభ్రాంతి దొలగు॥ యెరుకుండదన్నా మాట్లాడుటకు యేమిలేదన్నా॥

8 యెరుకనగా యేవస్తువు ? యెరుకనగా యెక్కడుంది ? యెంతటిది యదీ ? యెరుకనగా యేర్పడినద ? యెరుకనగా యేమిలేదా ? యెరిగీ చెప్పుమురా॥ చెప్పితె మేము యెరిగి వొప్పెమురా॥ మరుగుయిదే మూల మాయ దొలుగుటకు । గురుపుత్రుడైతేను గుట్టుదెలసుంటేనూ ॥ యెరిగి చెప్పుమురా । చెప్పితెమేము యెరిగివొప్పెమురా॥

9 గురుతుగ అధ్యారోపమె । యెరుకయు విశ్వంబుగాగ । యేర్పడి యుండుగ । మరియపవాదము నుంగన । నరుదెంచిన రీతి యెరుక ॥నరుగూచునుండూ । తిరిగిరాక గురుతులేకుండూ । బరువడిసంపూర్ణ బయలే నిలిచియుండూ । మరుగెరగినప్పుడె మాయలేకయుండు ॥ నరుగూచునుండూ । తిరిగిరాక గురుతులేకుండూ॥

10 గురై రిగె శరీరంబని । నిరతము బలికెదవుయెపుడు । నితరజను తో గురుతెరిగె తనువుయెట్టిది ? గురు తెక్కడయున్న దదియూ॥ గురిగా జెప్పుమురా ? యెరిగేతనువా ? యెరిగి దెల్పుమురా । యెరుక మరుపూలా ? యెరిగేద ? యెరిగిందా ? యెరుగబడినద ? అది యేర్పాడియున్నదా ? గురిగాజెప్పుమురా ? యెరిగేతనువా ? యెరిగి దెల్పుమురా॥

11 గురుతన యెరుకనమాయే । హరిహర బ్రహ్మాదులన్న । అసురులు మాయే । గిరులన తరులన, మాయే । మరి బ్రహ్మాండములు మాయే॥ మంత్రములుమాయే । వేదశాస్త్రతంత్రములుమాయే । ధరపంచ భూతములు వరజీవేశులుమాయే । పరిపూర్ణమందూన । పరికించలే వాయే । మంత్రములుమాయే । వేదశాస్త్ర తంత్రములుమాయే॥

12 మూలము లేదనియంటివి । మూలము యెటువంటిదదియు మూర్తి యొకిర్తో ? । కాలమొదేశమొవస్తువొ ? వాలాయము । పలుకొ ? అదియూ॥ వాసిగాదెలుపూ। దెలశితెనీవు వర్ణించి నిలుపూ॥ కీలుదెలియక నీవుచాలవాదించేవు । మూలములేదాని మురశితె సరియగున ॥ వాసిగా దెలుపూ । దెలశితెనీవు వర్ణించి నిలుపూ॥

13 కలగన్న జగమురీతియు । కలికయుకర్పూరమున్ను । గలశినరీతిగ దిలకింపయెరుకబయలులొ । నిలకడగా యుండబోదు । నిజమింతే రన్నా । బయలునుగనితా । నిలువాబోదన్నా ॥ ఇలలోన యీరీతి॥ నెరిగి సద్గురు కృపగ । చలనాములేక నిశ్చలులై యుంటెనుచాలు ॥ **నిజమింతేరన్నా । బయలునుగనితా నిలువాబోదన్నా॥**

14 దృష్టాంతము ద్రాష్టాంతము । స్పష్టనుగా యెరుకయనుచు సాధించి రియా । సృష్టిస్థితిలయమా ? అది ! నిష్టలో ? మరియేమియుంది ॥ నెరిగీ చెప్పుమురా । దృగ్దృశ్యామా ? మరిగీతప్పకురా । కరువుగండ మూలా ? కాలత్రయంబూలా । నిరతాముజగమూలా । నిత్యానిత్య మూలా ॥ యెరిగిచెప్పుమురా । దృగ్దృశ్యామా ? మరిగితప్పకురా॥

15 దేనిని అద్వైతులుయిల । జ్ఞానముచే సాక్షియనుచు । గనుగొనిరో నద్దానినెద్వైతవిశిష్టులు । మానకమహావిష్ణువనిరి ॥ మతములవారూ అనుభవమే పరమాత్మానినారూ । మానుగ వేదములలోన వేదాంతూలు। పూనిబ్రహ్మనియన్న లేనెరుకయిదియన్న ॥ మతమూలవారూ । అను భవమే పరమాత్మానినారూ॥

16 యేమియు లేదని యంటివి । యేమది నీకెట్లు దెలిసె ? యెట్లంటివదీ ? సామితెనా ? శాస్త్రంబా ? నీమంబా ? నేస్తవంబా ॥ నెరుక పరుచుమురా । తెలిసితెనీవు । అరమరుంచకురా ॥ నామరూప నటన స్తోమజ గజ్జాల । కామమోక్షములా ? కైవల్యపదవూలా ? యెరుకపరచుము రా । తెలిసితె నీవు అరమరుంచకురా ॥

17 వ్రతములవారలు సతతము । మితములచేవెతలుజెంది మేదినిలోనశ హితవులు జెప్పుచునుందురు। మతిమంతుల మనుచుబల్కు ॥ మాటలు విన్నా । మాయభ్రాంతి మరిదొలగదన్నా ॥ శృతియుక్తి అనుభవస్థితి రహితాచలబోధ । హితగవూదెలిపి సమ్మతిపరచనటువంటి ॥ మాటలు విన్నా । మాయభ్రాంతి మరిదొలగదన్నా ॥

18 పలుకనిదే పరిపూర్ణము । పలికినదే యెరుకయనుచు । పలుకబడెను యీ । పలుకేఓంకారంబగు । పలుకనిదోంకారాతీత॥ పరిపూర్ణమదిరా। దాపలబిందు బయలైయున్నదిరా। సురచిరపలపలసున్నా నీడినయెరు~, గురుతూగయుండీ ఆగురుతూ విడబీయుండు ॥ పరిపూర్ణమదిరా, దాపలబిందు బయలై యున్నదిరా ॥

19 శంకలు దీరెను వినుమది । అంకెలలో ఒంటునొకటి। ఆత్మనబడునూ। రంకుల బొంకులజగమిది । వంకలు లేనట్టి అచలం । వాసీగగనుడీ । పై సున్నిడి వైకుంఠ మనుడీ । దేశికు శ్రీవెంకటేశ్వరు కృపచేత । శాశ్విత పదవిలో శబ్దించకుండుడీ ॥ వాసీగగనుడీ । పై సున్నిడి వైకుంఠ మనుడీ ॥

20 సత్యము పరిపూర్ణంబు । యసత్యము యెరుకనుచు నెరిగి । సద్గురు కృపచే । సత్యముగా నీ యెరుకను । సత్యముగా విడచినపుడే ॥ సాక్షుండదన్నా । సాక్షితొయెపుడు జగముండదన్నా ॥ అక్షాయముగ యెపుడు అచలబోధను మదిలొ। దీక్షాచే సాధించ దీరూనుసంశయము॥ సాక్షుండదన్నా । సాక్షితొ యెపుడు జగముండదన్నా ॥

21 వాదములేకను బోధను। సాధులతో వినినమీకు। సంశయముడుగు। సాధనములెన్ని జేసిన । బాధలకేగాని ముక్తి ॥ పదవీగాదన్నా । యీ బోధతో సాటిరాదన్నా ॥ సాధనలన్నింద్ర జాలములనియెరిగి । వేదాంతా తీతమౌ విధము నెరిగితెచాలు । పదవీగాదన్నా । యీబోధతో సాటిరాదన్నా ॥

౨౦॥ చెయ్యెత్తి మీకు మ్రొక్కెద । కయ్యంబిదికాదు । ఇహపర కడతేరుట ముల్ । ఎయ్యది పూర్ణబోధయం । దియ్యెడ విశదీకరించి ॥ ఇది దెలిపెరనుచూ। సమరసభావం, సాధించెరనుచూ। అయ్యలై గురువులై। ఆనందరుషులంచు । కయ్యానరచ్కెక్క । కాల్దూచు బెందులకో । ఇది దెలిపెరనుచూ॥

*.... అచలపరిపూర్ణ పరతత్త్వ కందార్థములు ....*

* సంపూర్ణము *



ఓం



శ్రీ గురుభ్యోనమః

# భ్రాంతిరహిత తత్త్వములు

## 1. కీర్తన

రామా రఘుకులసోమా బిరానరావా ।

కామా కరుణలలామా కాపాడలేవా ॥

1 ప్రేమతో నిన్నెంతబిలచిన పలుకకున్నవదేమది । తామసమ నా పైన నేనుతప్పు జేసినదేమది । యేమీ నేరమో దాచక తెల్పవేమీ ॥రా॥

2 దీనరక్షక దశరథాత్మజ దిక్కునీవని నమ్మితి। దానవాంతకధర్మరక్షక దయకుపాత్రుడ నంటిని । గానా । లోలరావేల నేతాళజాలా ॥రామా॥

3 పరమపురుష పద్మనాభ పతితపావన పాహిమాం । నిర్వికార నిరుప మాన నిర్మలాత్మక పాహిమాం । నిర్వి । శేష నిరంజన నీరజాక్షా ॥రామా॥

4 హరేరామా హరేరామా రామరామ హరే హరే । హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే । రాధా । కృష్ణగోవింద శ్రీరామచంద్రా ॥రామా॥

5 వరములివ్వమనివేడలేదు చీరలిమ్మనలేదుగా। కరులనిమ్మనిపురములిమ్మని సిరులనిమ్మనలేదుగా । ఘోరా రోగనివారణా గోరుచుంటి ॥రామా॥

6 ధరలో మ క్తల గ్రామమున నీదాసదాసుడనంటిని । దొరవు దాతవు గరుడవని నా మొరను వినరమ్మంటివి రారా హనుమయాఖ్యుని బ్రోవ భారమేరా ॥రామారఘుకులసోమా॥

## 2. కీర్తన

1 అంజనిపుత్ర భవభంజన శ్రీఆంజనేయా ॥అంజని॥
సంజీవము బోసి ధర్మసంరక్షణజేయు మయ్య ॥ వింజామరముల విసరి అంజలి జేసెదమునీకు ॥అంజని॥

2 రామాజ్ఞను సీతకొరకు రావణ రాక్షసులలంక । ధూమము గావించినావు సోమా రవిసురలుమెచ్చ ॥అంజని॥

3 మంత్రగ్రహ భూతరోగ యంత్రము మహామ్మారిశక్తు । లంతానీ దివ్య నామ మంత్రంబునమాడి పోవు ॥అంజని॥

4 ధర్మము విడనాడి యితర ధర్మంబుల నడచునట్టి । దుర్మార్గులబట్టి యమని ధర్మంబుల కప్పగించు ॥అంజని॥

5 భజియింతును వాయుపుత్ర భక్తితో మనసందు యెపుడు । భజియింతును సూర్యమిత్ర బంధంబుల బాపరావ ॥అంజని॥

6 భక్తుడవై రాముల నాసక్తితో పూజించి మాయ । శక్తిని దాటి తీవన్న సర్వముబయలాయె నన్న ॥అంజని॥

7 ధరమక్తల పడమరదిశ స్థిరముగ నిలచున్నవాడ । అరమరజేయకను రావ హనుమాయాఖ్యునిబ్రోవ ॥అంజని॥

## 3. కీర్తన

1 చల్లనితల్లీ ఓ నల్లాజానమ్మ రావె ॥చల్లని॥ యెల్లాలోకాలకల్పవల్లీ వేగమె భక్తా। యుల్లామందూన జేరి మెల్లామెల్లాగబ్రోవ ॥చల్లని॥

2 ముక్కంటిదైవంబును మక్కువతో పెండ్లియాడి । పెక్కు రూపంబుల జగమెక్కువ గాపాడినావు ॥చల్లని॥

3 అష్టాదశపద్మంబున దర్శిష్టా స్వరూపిణివై । శిష్టాజనపరిపాలన దుష్టా సంహరణ జేయు ॥చల్లని॥

4 వేదంబులు నీ పలుకులు వేదామాతవునీవె । నాదూబిందుకళలు నాదీ బీజామునీవె ॥చల్లని॥

5 శింశూమారమున చంద్రసూర్యా తేజంబులునై । హంసై దేహముల యందు సంచారమజేయు నీవె ॥చల్లని॥

6 సిరులివ్వను చింతామణి పరమాపద మనగనీవె । సురమునిగణ నుత భూషిణీ నిరతము స్మరియింతు మదిని ॥చల్లని॥

7 పంచామహా భూతంబులు పంచాదేవతలునీవె । పంచావర్ణంబులును పంచాక్షరములు నీవె ॥చల్లని॥

8 పంచాతన్మాత్రలూను పంచాశక్తులును నీవె । సంచితాదికర్మా ప్రాపంచంబును నీవెసుమ్మీ ॥చల్లని॥

9 నాకరికి సంపద విద్యా నాకరికిసిరి రాజ్యంబులు । నాకరికి ధనమైశ్వర్యము నిక్కము నీ మహిమగదా ॥చల్లని॥

10 అందంబగు నీ ధ్యానమె మందని మదినమ్మికుంటి । మందులు తినితిని విసుకూ జెందితినిక చాలునమ్మ ॥చల్లని॥

11 పెద్దాచెరువలుగు దిగువ ప్రేమతో నిలుచుంటివమ్మా । పెద్దాచిన్నలుజేరి ముద్దుగబూజింతురుగదా ॥చల్లని॥

12 దరమక్తల గ్రామంబున స్థిరవాసము జేసినావ । అరమర జేయకనురావ హనుమాయాఖ్యునిబ్రోవ ॥చల్లని॥






## 4. తత్వము

1 వినవెతల్లి కనకదుర్గా । మనవిచే కొనవేమమ్మా । అనుదినము నీ నామ స్మరణ మనసున నెడబాయనమ్మా ॥విన॥

2 చింతలెల్లను బాపుటకు చింతామణి నీవేనమ్మా । వంతుకెక్కినశివుని రాణివి యింతపంతామేలనమ్మా ॥విన॥

8 పిండబ్రహ్మాండములకెల్లను దండిశక్తివి నీవమ్మా । నిండుగా సహస్రారమునను వుండివెలుగైనావమ్మా ॥విన॥

4 పంచ భూతము పంచికరణము పంచకోశములీవమ్మా । పంచియెంచను గొప్పకొంచెము నంచితార్థము నీవమ్మా ॥విన॥

5 తరులుగిరులు నరులుమృగములు సురలునీవైనావమ్మా । హరిహరా బ్రహ్మాదిలోకము సురాసురులును నీవమ్మా ॥విన॥

౭ సకలవిద్యలు వేదశాస్త్రము సకలమతములునీవమ్మా । సకలదేశము సకలనీతులు సకలరూపులు నీ వమ్మా ॥విన॥

7 ద్రష్టదృక్కులు దృశ్యరూపము నిష్టలెల్లను నీవమ్మా ॥ అష్టతనువులు అష్టదిక్కులు సృష్టిలయములు నీవమ్మా ॥విన॥

8 యంత్రమహిమలు యింద్రజాలము తంత్రము నీవేనమ్మా । మంత్రములు ఓంకారప్రవణము మంత్రరాజము నీవమ్మా ॥విన॥

9 స్థూలసూక్ష్మ కారణములకు మూలమై యున్నావమ్మా । నీలతో యద మధ్యమెరుపూ జాలమే నీ మహిమమ్మా ॥విన॥

10 చూడజపతప మంత్రయోగము జాడనీవై నావమ్మా । గాఢతరమగు జగ యుగంబులు గూడనీవై నావమ్మా ॥విన॥

11 సత్తుచిత్తులు విద్యవిద్యలు మొత్తమునవీవేనమ్మా । వృత్తినాదబిందు కళలకు విత్తువై యున్నావమ్మా ॥విన॥

12 జ్ఞానమనఅజ్ఞానమన సుజ్ఞానమననీవేనమ్మా । ఘనముగను ప్రజ్ఞానమన విజ్ఞామన నీవేనమ్మా ॥విన॥

13 ఇహముపరము బంధముక్తులు అహమునీవై నావమ్మా । దేహి దేహము లనగ నీవె సోహమననీవేనమ్మా ॥విన॥

14 యెరుకమరుపులు సాక్షిమాయ గురుతుయన నీవేనమ్మా । స్ఫురణ అంతఃకరణ జ్యోతి మరుగుమాటలు నీవమ్మా ॥విన॥

15 మొదలులేకనువచ్చితివి నీ మొదలు దెలియలేరమ్మా । కదలనిదికల దనుచు నెరిగిన నీ మొదలు లేనేలేదమ్మా ॥విన॥

16 వున్నదనిమరి లేదుఅనుటకు కన్నతల్లివినీవమ్మా । తిన్నగాగురుజేరి గనగా సున్నయై పోతావమ్మా ॥విన॥

17 అందముగనుక్రిష్ణతీరము సుందరము బెజవాడమ్మా । యెందుజూచిన భక్తవరులా నందపర వశులైరమ్మా ॥విన॥

18 గట్టిగాను యింద్రకిలమను గట్టుపైనున్నావమ్మా । దిట్టముగహనుమ యాఖ్యుడు నీగుట్టుగురునిచే గనెనమ్మా ॥వినవే॥

## 5. కీర్తన

1 దారిద్రంబులు లేకపోవుటకు దారులు యిదుగో వినరండి । ఘోరమైన సంసారవార్ధిలో గూలిమునిగి చెడిపోకండి ॥దారి॥

2 ప్రొద్దున లేచిన తోడనెముందుగ ముద్దుగస్నానము జెయ్యండి । వద్ది కతో మీయిష్టదైవమును వదలక మదిలోదలచండి ॥దారి॥

3 పౌర్ణమీ అమవాస్యదినంబుల పొందుసతులతో మానండి । పరధన పరస్త్రీ పరనిందాదులు పాపమనుచు నవివిడువండి ॥దారీ॥

4 వట్టితప్పులను మోపి భార్యను కొట్టితిట్టపనిగాదండి । మట్టుగసంసారం బుదిద్దుకొని గుట్టుగ నుండగవలెనండి ॥దారీ॥

5 యిల్లువాకిలి శుక్రవారమున అలికి ముగ్గువేయించండి । తలలంటుక స్నానంబు జేయుమని యిల్లాలికి సెలవియ్యండి ॥దా॥

6 యెక్కువగా నామత్తువస్తువుల నభ్యాసంబునుమానండి। చక్కగజరిగే సంసారములో చిక్కులుగలుగును చూడండీ ॥దారీ॥

7 జూదంబులు పెడవాదంబుల బహుబాధలు వచ్చును గనరండీ । పెద్ద లచెడిపి కొంపలుముంచే పెద్దతనముల మానండీ ॥ధా॥

8 భగవత్కార్యము లెన్నివచ్చిన భాగ్యములేదన బోకండి । భగవం తుడు మీకిచ్చినదానిలో భక్తితో దానము చెయ్యండి ॥ధా॥

9 తల్లితండ్రులే తొలిదైవంబని దలచివందనము జెయ్యండి । యిలమా నవుడై పుట్టినందుకు ఫలమనిమీ మదిదెలియండీ ॥దారీ॥

10 అన్నదమ్ములతో పోరాటంబులు యెన్నటికిని తగదనుకొండీ । అన్ని కష్టములకోర్చి ఓపికతో నున్నవాడె మొనగాడండీ ॥దారీ॥

11 మతధర్మంబుల వదలిన భ్రష్టుల గతిదుర్గతియని దెలియండీ । సతత ముదేవాలయములకేగి సద్గతి నందగవలెనండీ ॥దారీ॥

12 పండుగదినముల కాలమునంతా దండుగ జేయగరాధండి । దండిగనై వా భజనలు జేయుచు నిండుమనసుతో నుండండి ॥దారీ॥

13 జూటసాక్ష్యము దొంగతనములా జోలికిమీరు పోకండి । చేటుగలుగు అపకీర్తికార్యముల బాటదొలగిమీరుండండీ ॥దారీ॥

14 యెంతవారి స్నేహంబు జేసిన నంతటివాడౌగదనండీ । యద్భావం తద్భవతీ యనేశృతి అర్థ మబద్ధము గాదండీ ॥దారీ॥

15 వసుధమక్తల గ్రామంబుననే వాసితియిట్లని వినరండి। పశుపతీశ్వరుడు హనుమయాఖ్యుని పాలన జేయును పదరండీ ॥దారీ॥

## 6. కీర్తన

1 నాపాలి శ్రీ గురు నన్నేలరావా। ఆపాద లనుదీర్చి కాపాడలేవా ॥నాపాలి॥

2 యెంతనిను వేడిన యేమానవేమీ। పంతామనామీద వల్కావదేమి ॥నాపాలి॥

3 గొప్పరోగముబాధ చెప్పలేనయ్యా। తిప్పలున్నది చాలా తప్పించవయ్యా ॥నాపాలి॥

4 దిక్కూనీవేగతి దీనూడనన్నా। యెక్కాడవెదకిన యెవరులేరన్నా ॥నాపాలి॥

5 కోపామ నాపైన తాపమాస్వామి। దాపుజేరినవాడ దయరాని దేమి ॥నా॥

6 పరిపారివిధముల పార్థించుచుంటీ। కరుగాదనీమనసు కఠినమేమంటీ॥నా॥

7 నిష్టతోనినుదలతు నిజమునాతండ్రీ। భ్రష్టానష్టంబుల భయముమాన్పండీ॥నా॥

8 అందమౌసీధ్యాన మందుంటినప్పా। మందుతినితిని విసుకు జెందితీనప్పా॥నా॥

9 చిక్కేమీచరణములు శ్రీవెంకటేశ। దక్కాతిభవపాశ దండవినాశ॥నా॥

10 పసుదమక్తల గ్రామా వాసూడనంటి। దోసీలొగ్గితిహనుమద్దాసు నేలంటీ॥నా॥

## 7. తత్వము

1 శ్రీగురునీశరణుజేయుదమా ॥ వేగమెసేవజేయుదమా। బాగుగా పూజ సల్పుదమా అఘములఁ బారదోలుదమా ॥శ్రీ॥

2 తనుమనోధనము లొసగుదమా। ఘనంబౌబోధ జెందుదమా। అనయమీయెరుక నొదలుదమా। జననమరణములబాయుదమా ॥శ్రీ॥

3 తనువులుశాశ్వితముగాదు । ధనముమన వెంటరాబోదు । లేనియ్యాభ్రమల బడరాదు । గానగురుపాదమిడరాదు ॥శ్రీ॥

4 గురువరభార మీదయ్యా । దురితముల్ బారదోలయ్య । పరునిగాదలచ రాదయ్యా । పరమనే పదవిదెలుపయ్యా ॥శ్రీ॥

5 నరేనీకింక భయమేలా । మరీనాపల్కువినుబాలా । యితరులబోధ విన లీలా । వెరువకవినుము క్రమమూలా ॥శ్రీ॥

6 మొదటనీకచలమెరిగింతు । పిదపలేనెరుక చూపింతు । తుదకు ఆ ఎరుకనిడిపింతు । మదికిముమ్మారు నాటింతు ॥శ్రీ॥

7 కనుము ద్వాదశియే గలదనుచు । వినుము షోడశియు లేదనుచు । అనుము జగమంత మిధ్యనుచు । చనుము నేనీవులేననుచు ॥శ్రీ॥

8 అప్పా నీ వింటివీబోధా । చూపగా కంటివాలేదా । మెప్పుగానాటెన లేదా । తప్పితె మళ్లి వినుబోధా ॥శ్రీ॥

9 సారమౌ దీక్షతియ్యమురా । భారములేదు చూడుమురా । సరువపరిపూర్ణ వేదమురా । మరువ కే । మాటనమ్మకురా ॥శ్రీ॥

10 అంతటానిండి యున్నదిరా । వింతలు లేవు చూడుమురా । చింతలుమాని గనుగొనరా । అంతపరిపూర్ణమిదౌ గనరా ॥శ్రీ॥

11 ధరలోశివ రామదీక్షితులు । మరియు శ్రీకృష్ణదేశికులు । హరులు షీ ఖ్ఖానలక్ష్మణులు । విరివిగా దెలిపిరీఘనులు ॥శ్రీ॥

12 శంకలుబాపె వినుమన్నా । వెంకటేశ్వరుల గనరన్నా । యింకభయ మేమి హనుమన్న । అంకెనపల్లి స్వామన్న ॥శ్రీ॥

## 8. తత్తములు

1 వున్నదిగురుడన్నది నే । కన్నదంతటనున్నది । వున్నదేమోనున్నది నేనన్నదే లేకున్నది ॥ఉ॥

2 యెరుకమరుపులు గానిది అది । యేకమై తానున్నది । గురునిచే మేల్కొన్నవారికి । పరమపదమైయున్నది ॥ఉ॥

3 అండపిండము గానిది బ్రహ్మాండ మేమనరానిది । దండిగా అధ్యారోప పండిదార్థము లేనిది ॥ఉ॥

4 మతమతంబులు గానిది । అది గతులకెన్నడురానిది । సతతము గురు సేవజేసిన । సాదులకెగురుతైనది ॥ఉ॥

5 జపతపంబులుగానిది అది జన్మరహితంబైనది । చపలులై తిరిగేటివారికి । చెప్పశక్యముగానిది ॥ఉ॥

6 యాగయోగము గానిది అది । భోగభాగ్యము లేనిది జోగులు బైరాగులు అనె త్యాగులకు కనరానిది ॥ఉ॥

7 సాధనంబులుగానిది అది । బోధరూపంబైనది । మోదమలర సమాధులచే సాధ్యంబు యెన్నడుగానిది ॥ఉ॥

8 ముద్రలయిదునుగానిది అది । ముదితయవనములే నిది । చిద్రరూపము గానిది అది । భద్రమైతానున్నది ॥ఉ॥

9 వేదశాస్త్రముగానిది అది । వాదభేదములేనిది । సాధనంబులుయెన్ని చేసిన సాధ్యరహితంబైనది ॥ఉ॥

10 జ్ఞాన జ్ఞానముగానిది అది । ఘనులసాధ్యంబైనది । స్వానుభావాతీతులకును। సర్వసమరసమైనది ॥ఉ॥

11 పంచికరణము లేనిది అది । పంచశక్యము గానిది। సంచితము లెడబాపునట్టి । సద్గురుమహిమైనది ॥ఉ॥

12 మంత్రమహిమలు గానిది అది । తంత్రమే లేకున్నది । యంత్రతంత్రంబులకు ఆవల । స్వతంత్రమై తానున్నది ॥ఉ॥

13 బూటకంబులు గానిది అది । మాటలకు పైనున్నది । ఆటలకు పాటలకు మీరియు । అంతటాతానున్నది ॥ఉ॥

14 సత్తుచిత్తులు గానిది అది । వృత్తబయలైయున్నది । విత్తుచెట్టుమర్మమెరిగితె । విశ్వమే లేకున్నది ॥ఉ॥

15 ఈశ్వరుండనరానిది అది । విశ్వరూపము గానిది। విశ్వతైజన ప్రాజ్ఞులనెడు। వివరమేమియు లేనిది ॥ఉ॥

16 యాత్రలేమియు గానిది అది । పాత్రమెన్నగ రానిది । ధాత్రిలో యీ సూత్రమెరిగిన దాతలకు వశమైనది ॥ఉ॥

17 స్థూలసూక్ష్మముగానిది అది । నామరూపులులేనిది । కాలములు మూడింటి కావల । కర్మరహితంబైనది ॥ఉ॥

18 ద్వైతమన్నదిలేనిది । అద్వైతమెన్నగ రానిది । ద్వైతఅద్వైతముల మీరియు । దోషరహితంబైనది ॥ఉ॥

19 పిండరూపము గానిది । బ్రహ్మాండమన్నదిలేనిది । ఖండమగు పరమాత్మ ప్రత్యగాత్మలకు మీరున్నది ॥ఉ॥

20 అష్టదళములుగానిది అది । అష్టదిక్కులు లేనిది । సృష్టిస్థితిలయములకు। ఆవల స్పష్టమైతానున్నది ॥ఉ॥

21 హంసరూపముగానిది అది । హింసయెన్నడు లేనిది । సంశయంబులు లేక పరమ । హంసకావలనున్నది ॥ఉ॥

22 ద్వాదశి మంత్రార్థ మెరిగితె । దైవరూపంబైనది । సాధుజనులకు సమ్మతంబై । శాశ్వితంబై యున్నది ॥ఉ॥

23 షోడశీ మర్మంబుదెలసిన । శిష్టులకు యెరుకైనది । మూడులోకంబులును ముగ్గురు । మూర్తులకు పైనున్నది ॥ఉ॥

24 ధరలో శ్రీశివరామదీక్షితు లెరుకపరచిన బయలది । గురుతుగాను భాగవత శ్రీకృష్ణగురువులకెరుకది ॥ఉ॥

25 గురుతుగా ఫీల్ఖానలక్ష్మణ । గురువుపుత్రుల కెరుకది । సరిగ చిత్తూరి వెంకటేశ్వర సాధుసమ్మతమైనది ॥ఉ॥

26 ధరలో మక్తల గ్రామమందున । పరమభక్తుల కొరకది । విరివిగాను హనుమాయాఖ్యుడు । విశదపరచెను బోధిది ॥ఉ॥

## 9. తత్త్వము

1 వినరా చిదానందమయ్యా । మదిలో అనుమానించక నిజమువిన జెప్ప వయ్యా ॥వినరా॥

2 జ్ఞానామె శాశ్వితమంటే । ఆ జ్ఞానంబు సత్యమున జనియించెవింటే ॥వినరా॥

3 పుట్టింది గిట్టుననునట్లు । యిట్లు పుట్టేటి జ్ఞానంబు । గట్టిదనేదెట్లు ॥వినరా॥

4 జ్ఞాన మజ్ఞాన మన్నాకటే। ప్రజ్ఞాన విజ్ఞాన సుజ్ఞాన మన్నాకటే ॥వినరా॥

5 దేహి దేహములొకటే గావా । యిట్లు దేహమును వీడిదేహివున్నాదే త్రోవా ॥వినరా॥

6 నేను మేను వేరదెట్లు। యిట్లు నేను లేనిదె మేనుచేయు పనులెట్లు॥వినరా॥

7 తన్నుతా నెరిగేదియేమి । అట్లు తన్నుతాను అవుతే । తనువువిడదేమి ॥వినరా॥

8 తనువ సత్యము ॥తా॥ నిజమౌనా। చూడు। తనువుశర్కరబొమ్మకొంత చేదౌనా ॥వినరా॥

9 సాధనములుజేయ వలెనా । యెట్టి । సాధనంబులనైన పరముగననౌనా ॥వినరా॥

10 అష్టదళములయందు గలడా । బ్రహ్మద్రష్ట యైలోపాల దాగున్నవాడా ॥వినరా॥

11 నిర్వికల్పము జెందెదేమి । యిట్లు నిర్వికల్పము జెంది నిలచుండెదేమీ ॥వినరా॥

12 అనుభవమె ముఖ్యమేమన్నా । మోక్షమనుభవాతీతమని వినలేదేమన్నా ॥వినరా॥

13 యెరుకంతటాయున్నదేమి । అట్లుయెరుకంతటయుంటే జూపరాదేమి ॥వినరా॥

14 మహావాక్యములును నాల్గంటే। వింటే అహము నేననే భ్రాంతి విడిచెదెట్లంటే ॥వినరా॥

15 సర్వంబు బ్రహ్మమైయుంటే । అందు పుర్వేట్లు గలిగేను చెప్పతెలి సుంటే ॥వినరా॥

16 శ్రీ శివరామదీక్షితుల వారు । లెస్స భువిలో నచలబోధ నెగజల్లినారు ॥వినరా॥

17 భాగవతశ్రీ కృష్ణగురుడూ ॥ యిదుగో బాగూగ కందార్థములువ్రా సె ఘనుడూ ॥వినరా ॥

18 వెంకటేశవధూత స్వామి । నాదు శంకలెల్లను బాపెయింక భయమేమి ॥వినరా॥

19 హనుమంత దాసుడోయన్నా । బోధవినిపించు వింటె యికజన్మ లే దన్నా ॥వినరా॥

20 ధరమ_క్తల గ్రామమందు । అందుపరమ భక్తులకెల్ల దెలిపె యీ సందూ ॥వినరా॥

## 10. తత్త్వము

1 తత్వమూలు జదువగానే ధన్యులైనారా । మీతామసాది గుణములనెల్లా తరిమివేశారా ॥తత్వమూలు॥

2 భజనలు బహుసేయగానే భక్తులైనారా । మీ బండగుణమూలనెల్లా చండి వేశారా ॥తత్వ॥

3 నామమూలు దిద్దగానే స్వాములైనారా । మీ । కామ క్రోధగుణముల నెల్లాకాల్చివేశారా॥తత్వ॥

4 జడలుగడ్డము లుంచగానే జాణలైనారా । మీ । జారచోర గుణముల నెల్ల జంపివేశారా ॥తత్వ॥

5 వ్రతములు బహుసేయగానే గతులుగన్నారా । మీరు । పతితపావనమైన సత్యాపథము గన్నారా ॥తత్వ॥

6 యాత్రలు సేవించగా పావిత్రులైనారా । గొప్పా। సూత్రమూనూకన్నూ లారా జూచియున్నారా ॥తత్వ॥

7 మెప్పుగా విభూతి బూసి అప్పులైనారా । మీ । తప్పులన్ని సాక్షితోద వొప్పుకున్నారా ॥తత్వ॥

8 పూజలు బహుసేయగానే పుణ్యులైనారా । మీరూ । పూజజేసే గురుని మహిమా పొడచికన్నారా ॥తత్వ॥

9 వేదములూజదవగానే సాధులైనారా। మీరు । సాధనములులేని నిజగురు బోధవిన్నారా ॥తత్వ॥

10 ముద్రలూసాధించగానే ముక్తిగన్నారా । మీరు । భద్రమైన బయలూ దెలసీ పలుకకున్నారా ॥తత్వ॥

11 వేషమూలూ వేయగానే వేత్తలైనారా । మీ । ఆశాపాశాబంధములనూ గోసియున్నారా ॥తత్వ॥

12 కోరికోరి పేరూకొరకూ గురువులైనారా । గొప్పా । వారివద్దా చిలుక పలుకులు వదలుకున్నారా ॥తత్వ॥

13 హనుమయాఖ్యుడు వ్రాసేననుచూ అలగిపోతారా । మీరు । ఘనుల జేరి నిజమూదెలసి కలుసుకుంటారా ॥తత్వ॥

## 11. తత్త్వము

1 కన్నవారా । లేక విన్నవారా నిజము ॥కన్నవా॥
తిన్నాగ సద్గురుసన్నిధిలోజేరి ॥కన్నవారా॥

2 తన్ను తాననకాను యెన్నా శక్యముగాక । వున్నా పరిపూర్ణామీ కన్నులతో మీరు ॥కన్నవారా॥

8 పలుకూల కందాకే తలపూలెరుంగాక । కలకాల మొకరీతి గల బ్రహ్మ మంతాట ॥కన్నవారా॥

4 యెండా మావులరీతి నుండే బ్రహ్మాండాము । ఉండీనపోయిన రెండూ యెరుగని దాన్ని ॥కన్నవారా॥

5 అన్నిటి నెరుగూచు నున్నాయెరుకను బట్టి । సున్నాజేసిపైనున్నా పరమాత్మాను ॥కన్నవారా॥

6 ధరలోన వెంకటేశ్వర దేశికులచేత । సరిగాహనుమద్దాసు లెరిగీ న పర మూను ॥కన్నవారా॥

## 12. తత్త్వము

1 వినరయ్యా యీ అచలబోధను। వినసొంపుగనున్నా। వినిననుకనసొంపై యున్నా । వినికనినను మీ జననమరణముల బాధదొలుగునన్నా మానవజన్మకు ఫలమన్నా ॥వినరయ్యా॥

2 మతములవారలు తమసమ్మతముగ మితములు యేర్పరచి । శాస్త్రముల శృతులను యేర్పరచి । గతులుగానకా వెతలుజెందిరా స్థితినిదూర పరచి సతతము నమ్మకు మదితరచీ ॥వినరయ్యా॥

3 అంతటనిండియు ఆది మధ్యమున అంత్యము లేదన్నా । సర్వపరి పూర్ణ ముతానన్నా । చింతలేక శ్రీసద్గురుచరణము చెంతజేరుమన్నా అంతునీకు తెలియ జేయునన్నా ॥వినరయ్యా॥

4 యజ్ఞయాగములు క్రతువులు జేయుదు । రజ్ఞులు భువిలోనా । యింద్ర భోగంబుల భ్రమలోనా । ప్రజ్ఞలనుచు సుజ్ఞానులుమెచ్చరు నమ్మకుమది లోనా । యజ్ఞమనహింసగాదె కూనా ॥వినరయ్యా॥

5 మంత్రమహిమలు మదిచంచలములు । తంత్రములవియెల్లా ॥ జన్మము కడతెరుటకల్లా । యింద్రజాల మహేంద్రజాలములు పంచముద్ర లెల్లా । యంత్రసూత్రంబులు జగమెల్లా॥ వినరయ్యా॥

6 జపములు తపములు యెన్నిజేసిన జాడతెలియరాదు। పరముప్రత్యక్షము తాగాదు । విపరీతపు యీ విద్యలచాతను చపలత్వము బోదు కపట వేషంబుల బడరాదు ॥వినరయ్యా ॥

7 వేదభాష్యములు చదువచదువగా వాదులధికమైరి । సత్యమునుదెలియ దూరమైరి । వాదులనోటికి బూడిదయని వేమన్న జెప్పవినిరి । గాధలో బడి తప్పక చెడిరి ॥ వినరయ్యా॥

8 స్పష్టముగాను అష్టదళంబున దృష్టిలయంబగునా । జీవ బ్రహ్మైక్యము తానౌనా । సృష్టిస్థితిలయ క్రమములనెరుగక శ్రేష్ఠించదగునా । భ్రష్ఠులై పడిరి భ్రాంతిలోనా ॥వినరయ్యా॥

9 సకలదేశముల సకలకాలముల సకలవస్తువులయందు । నిండున్నదేదో కనుముందు। వికటమైన యీ యెరుకనంతటాయెరిగి విడువుమన సందు। గురుముఖనగను యీసందు ॥వినరయ్యా॥

10 ద్వాదశిషోడశి మంత్రార్థంబుల మర్మమెరుగవలెను । యెరిగితా ధన్యుడు కావలెను । వాదభేదములు మాని సర్వవిధ వాంఛలుడుగవలెను చూడు బ్రహ్మాండము కలవలెను ॥వినరయ్యా॥

11 నేశ్రవణవంబును నేసర్వంబును నేనేసాక్షియనరాదా । విజ్ఞానదశను విన లేదా । నేప్రజ్ఞానను నాల్గువాక్యములు నేనే నేనే యనరాదా యివి యెల్ల మాయనే కాదా ॥వినరయ్యా॥

12 స్థిరముగాను శివరామదీక్షితుల భావముగనరండి । భాగవతకృష్ణుడెరిగె నండి । విరివిగాను శ్రీ వెంకటేశ్వరు డెరిగె మర్మమండి । తెలిపె హనుమంత యోగికండి ॥వినరయ్యా॥

## 13. తత్త్వము

1 అందునా బోధ అందునా। అజ్ఞానులకు మదికందునా ॥బోధ॥ అందునా యీ అచలబోధ పొందుగాసద్గురుని సేవా । నందముగ సల్పంగనేరని మందమతులైనట్టివారల ॥అందు॥

2 వేదములు నాల్గారు శాస్త్రము చదివిసర్వంబెరిగినామని । వాదములు జేయూచువెట్టి గాధలోబడి గొణుగువారికి ॥ అందు॥

3 జపతపంబులు యజ్ఞయాగము లపరిమితమగు మంత్రమహిమలు। కపట వేషంబులను దాల్చి చపలులై తిరిగేటిచనటుల ॥కందునా॥

4 అంగమున లింగంబు శివుడని పంగనామమేరంగడనుచును । పొంగుచును మతగర్వమున నిజసంగ తెరుగని దొంగలకుమది ॥కందునా॥

5 సతతముగురు సేవజేయక । మతము అభిమానంబు వదలక । గతులు గానక వెతలుజెందే పతితులకు పాషండులకు మది ॥కందునా॥

6 దేహిదేహంబులకు మధ్యన సోహమని పలికేటిహంసను ఊహచే పర మాత్ముడనిమది మోహము జెందేటిమూర్ఖుల ॥కందునా॥

7 మూలములేనట్టి మాయతోలు బొమ్మకీలుదెలియక । చాలతర్కముజేసి తుదకెమ పాలబడి చెడే పామరులకు ॥అందునా॥

8 యెండమావుల జలమురీతి నుండే య్యాబ్రహ్మాండమంతయు । దండి కలయని యెరుగజాలక తిండికై తిరిగేటివారికి ॥అందునా॥

9 తనుమనో ధనములనుమూటిని వినయముగ శ్రీగురునికొసగక। అనయ మహాంకారవశులై తనువుభ్రాంతులు విడనివారల ॥కందునా॥

10 యీషణత్రయపాలమున దుర్వాసనత్రయమందుమునుగుచు ।వేషభాషలు రోయకనుతమ ద్వేషములు విడలేనివారల ॥కందునా॥

11 అచ్ఛమైన బ్రహ్మవేత్తల స్వచ్ఛముగ తానెరుగలేక । హెచ్చుగాను పిచ్చివారిని మెచ్చితిరిగే తుచ్ఛనరులకు ॥అందునా॥

12 వున్నదని ద్వాదశియులేదని యన్నషోడశి యనుచు దెలియక । తన్ను తనలో తెలియుమనెడి చిన్నకూతల పిన్నలకుమది ॥కందునా॥

13 వాసిగను మఖ్తాలగ్రామ నివాసుడగు మందిప్పలనుమ । ద్దాసుడీకృతి జేసినాడని రోషమందిన దోషకారుల ॥కందునా॥

## 14. పల్లవి

అందురూ అందారందురూ । మాదచలబోధని । అందురూ అందా రందూరూ ॥

### అనుపల్లవి

1 అందురూమాదచలబోధని । కొందరికి ఉపదేశమిచ్చుచు సందియము లను దీర్చలేకను । బంధమున బడద్రోయ నెంచి ॥అందురూ॥

2 వాటమగు బృహద్యశిష్ట । పీఠమర్మాధర్మములుమది । నాట సద్గురుసేవ జేయని । బూటకులు మరిమాటిమాటికి ॥అందురూ॥

3 దట్టమగుకందాధరాములలో । గుట్టుగురుని నోటవిన। లేనట్టి మనుజులు గ్రంధములగని । మిట్టిపడి లోకులను జెరుచుట॥ కందురూ॥

4 పండితాగర్వంబుచేగురు । నండజేర జాలలేకను । తిండికై యింటింట మేమే। దండివారలమంచుదిరుగుచు ॥అందురూ॥

5 పితృనైశ్వర్యంబుకన్న । పుత్రుడందినరీతిబోధ । సూత్రములు నా సాంప్రదాయ । పాత్రులెరిగెదరంచుదెలియక ॥అందురూ॥

6 మూడువాక్యమూలగొప్ప । గూఢమైనజాడ నెరుగక । గాఢమగు అజ్ఞానవశమున । గాధలో బడిపాడుజేయుట ॥కందురూ॥

7 పెద్దలు గుమిగూడి గురువరు॥ సుద్దులను గొనియాడుచుండగ వద్ద మూర్ఖులుజేరి మేమే । పెద్దలముయనిబుద్ధి శూన్యులు ॥అందు॥

8 కానిలేనిమోసయుక్తులు। కల్పనలుజేయూచు ధరలో। మానమభిమానంబు విడిచి । మందమతులగుజ్ఞానశూన్యులు ॥అం॥

9 గుసగుసలు మాట్లాడిగొప్ప । గురురహస్యము తెలుపదగదని । గసిబిసి నిగాజేసి లోకుల । గాసిబెట్టి చెరుపదలచి ॥అం॥

10 భాసురంబుగ శ్రీశికింద్రా । బాదసద్గురుమందిరంబున । వాసికెక్కిన హనుమయార్యుల । వాక్యములుమదినాటలేకను ॥అం॥

## 15. తత్వము

1 మీకే మంచీది మంచిది । గురుభక్తినున్నా । మీకే మంచీది మంచిదీ ॥

2 మీకేమంచీది భక్తికి । మించినావేరుక్తిలేదు । రాక పోకాలులేని రాజ మార్గమైన బోధా ॥మీకే మంచీది॥

3 ప్రొద్దునా నిద్దూరలేచి । వద్దికీ యే తెంచిగురునీ । వద్దికతో దర్శనము జేయుట । బుద్ధిమంతుల మొదటిపనియగు ॥మీకే॥

4 గురునిదర్శన మాత్రమూన । కూలిపోవును జన్మబంధము । అరసి గురుడూ స్పర్శజేయా । యఘములెల్లా బాయునిజముగ ॥మీకే॥

5 వందనాది క్రియలవల్లా నందముగ సమకూరుయశమే । మందుభక్తి తోడ మోక్షామందిరీ మును భక్తులంతా ॥మీకే॥

6 వేంకటేశ్వర స్వామికృపచే జంకులెల్లను దీరెననుచూ । శంకలేకను దెలుపనాయె వంకలేని యచలబోధా ॥మీకే॥

7 శ్రీ సికింద్రాపురమునందున । వాసిగానెలకొన్న సద్గురు । దాసుడగు యీహనుమయాఖ్యుడు వ్రాసెనని విశ్వాసముంచిన ॥మీకే॥

శ్రీ నిశ్చలానందఅబ్బుగారి వీరయ్యగారు చెప్పినది

## 16. తత్త్వము

1 మెచ్చరూ తుచ్ఛుల మెచ్చరు । సుజ్ఞానులెప్పుడు మెచ్చరూ తుచ్ఛుల మెచ్చరు ॥మెచ్చ॥

2 మెచ్చరూ యీ తుచ్ఛనరులను । అచ్ఛమైన బ్రహ్మవేత్తలు । పిచ్చి గురువుల జూచి భ్రమసే ముచ్చులను శివరామయోగులు ॥మెచ్చ॥

3 అప్పుడిప్పుడనగ రాకను । యెప్పుడున్నాపరము దెలియక । కుప్పి గంతులు వేసి మేమే । గొప్పయనగా అప్పబ్రహ్మము ॥మెచ్చరు॥

4 భూతలంబున నిజగురువులీరీతి జెప్పిన మాటవినకను । కోతివేషల నమ్మిజన్మకు హేతువులను సీతారాములు ॥మెచ్చరు॥

5 స్పష్టముగ షోడశియు ద్వాదశి। సద్గురునిచే దెలియలేకను। అష్టయోగము లందు చిత్రముము। లిష్టగ జేయంగ కృష్ణులు ॥మెచ్చరు॥

6 మేలిమిగను అఖండభావము లీలగా గురుకీలు దెలియక । చాలవాదము లాడు వారిని పీలుఖాన శంకరార్యులు ॥మెచ్చరు॥

7 దీక్షితుల పరిపూర్ణబోధచే । మోక్షమని గురుతెరుగలేకను । సాక్షి మాత్రంబైనకళనే । మోక్షమనినను లక్ష్మణార్యులు ॥మె॥

8 శంకదీర్చునట్టి దేశికు । వంకజేరివుపము నెరుగక । సంకరంబగు మత్రములచే శంకించువారిని వెంకటేశులు ॥మెచ్చరు॥

9 ఘనముగను యీ అచలబోధను । ఘనులచే యెరిగెరుక విడువక జనసమరణ ప్రవాహమునబడి చెడెడివారిని । హనుమయార్యులు ॥మె॥

10 అబ్బుగారి వీరయార్యుడు గొబ్బునాపరిపూర్ణ మెరిగి, దబ్బరాయైనట్టి యెరుకా మబ్బుబాపీ మాయనరులను॥మెచ్చరూ॥

## 17. తత్వము

1 యెందుజూచిన అందేయున్నాదీ । యేసందులేక । మదికందరాక మనమందులేక । అందిందుబోకతా ॥ నెందుజూచినఅందే ॥

2 కందువాతో పెద్దలంతా నందమొందీనట్టిపదవీ । మందమతులా కందాబోసిదీ । ఆనందమైతా । సందులేకనిండీయున్నాదీ ॥యే॥

3 రూపురేఖాలేక కన్నూ పాపలాకందంగరాకే । దాపులేకప్రకటమైనదీ । కాదానియన్నా । పాపులాకుతెలియారానిదీ ॥యే॥

4 పుట్టాకాగిట్టాకామాయాపుట్టుగిట్టులెరుగబోక । దిట్టమైతాకదల కున్నాదీ। యీబట్టబైలు । గుట్టుగురునికలవియైనాదీ ॥యే॥

5 యెప్పుడేకారీతిగాయేముప్పులేకాచెప్పరాకా । గొప్పకొద్దీగాక యున్నాదీ। పరిపూర్ణులైన । గొప్పవారికొప్పియున్నాదీ ॥యే॥

6 అండపిండ బ్రహ్మాండమవలఖండమైనవఖండములపైనుండి బయలై నిండియున్నాదీ । నిందించెడిపాషండులూ దర్శింపరానిదీ ॥యే॥

7 నేనుమేనూగాకపరులతానునేనూయనగబోకా । తానుతానై తత్వమైనదీ ' గురుమంత్రసిద్ధీకానివారికి గానరానిదీ ॥యే॥

8 యేమిలేకాయేమిగాకయేమనీవచియింపరాక । భూమయైతాకదలకున్నాదీ। శ్రీరామడుగుశివరామదీక్షితవరులుగన్నాదీ ॥యే॥

9 సంతతము మందిప్పలాహనుమంతసద్గురుకరుణచేత । చింతలన్నియు బాయనైనాదీ । వీరయ్యదాసు । భ్రాంతిలేకాదెల్పనైనదీ ॥

## 18. తత్వము

1 పన్నెండక్షరములకధవినుడీ ప్రజ్ఞవంతులారా । యెన్నరానిభవరోగములన్నిటి సున్నజేయుదానిగన్నవారలే ॥ పన్నెండక్షర ॥

2 వుత్తదియీమాటనిమనమందున తత్తరజెందకుడీ । సత్తుచిత్తులను మీరిన వస్తువు । వుత్తదెట్లు గురుపుత్రులసాక్షిగ ॥ పన్నెం॥

3 బట్టబయలుయని పెట్టుకుంటిపే । రొట్టిదెట్లుసుమ్మీ పుట్టిపేరునే పెట్టుకుంట్టిమరి । గిట్టుదునేనది యట్టులెయుండే ॥ పన్నెం ॥

4 యేమిలేదుయనియెరుగకయుంటే । నామరూపమేది పామరమును గురుపదములకొసగియు । నేమముతోయెరుకేమిలేదనె ॥ప॥

5 పదియార్గురిశత్రులనుజంపిన । పరమఖడ్గమండీ । సదమలరగసద్గురుచే దెలసిన । కదలనివస్తువుకనుపడునండీ ॥పన్నెం॥

6 అరయగాని శ్రీ భూమానంద । హనుమంతగురుండూ । కరుణజేసి అబ్బుగారివీరయా । పరమిదుగోయని సరగునదెల్పిన ॥ప॥

శ్రీభూమానంద హనుమంత రాజయోగి సద్గురు మహరాజకీ జై



## 19. తత్త్వము

1 యెందుకిలపై జన్మమెత్తితి । వెరుగవేమిర మూఢుడా
యెంతకాలముయుండి యటుపై । యెందుజనెదవు మూఢుడా ॥యె॥

2 ఆలుబిడ్డలు యన్న దమ్ముల । గోలలోబడి మూఢుడా
కాలమెల్లను కాసుకొరకై । ఖర్చుపెడుదువె మూఢుడా ॥యె॥

3 ప్రొద్దుప్రొద్దునలేచిసద్ది । పొట్టనింపియు మూఢుడా
యెద్దువలెపనులన్ని జేసి। నిద్రబోదువె మూఢుడా ॥యె॥

4 యెన్నిచదువులు యెన్నిశాస్త్రము । లెన్నినేర్చిన మూఢుడా
యేమిఫలితమొ తుదకుదీనిచె । నెరుగవేమిర మూఢుడా ॥యె॥

5 యోగసాధన లెరిగినందున । యేమిగంటివి మూఢుడా
జోగివై దేశాలుదిరిగి । జూచితేమిటి మూఢుడా ॥యె॥

6 యెజ్ఞయాగము లెన్నొజేస్తివి । యేమిదొరికెను మూఢుడా
ప్రజ్ఞకొరకా వరులుమెచ్చన । బలుక వేమిర మూఢుడా ॥యె॥

7 స్నానసంధ్యలు జపతపంబులు । చాలజేస్తివె మూఢుడా
కన్నులా యాపరబ్రహ్మము । గంటివేవో మూఢుడా ॥యె॥

8 దరవిసన్నను నేలువీరయ । గురునిగనుగొను మూఢుడా
దురితములనెడబాపి అచలము । కరుణజేయును మూఢుడా ॥యె॥

## 20. కానడ - ఆదితాళము

1 స్వామిచరణకమలా । జాయగురు స్వామిచరణ కమలా ।
భూమానందం బుధజన బృందం। బొందితో కైలాసం పరేశం ॥స్వా॥

2 చైతన్యాశ్రిత చంచల రహితం।ఏతన్నిర్మిధ్యాశుద్ధవియద్గురు ॥స్వా॥

3 మూలాభావం మునిగణగమ్యం । మూలాభావమిదం జ్ఞాతశరీరం॥స్వా॥

4 సుకతరబృందం స్వప్నానందం । శిఖికర్పూరం శివశివభావం ॥స్వా॥

5 పరమవిలాసం పాలితదాసం ।స్థిర శివపురనాథం స్థిరేశం॥స్వా॥

## 21. శంకరాభరణము - ఆదితాళం

1 భూమానంద బుధజన బృందారక । బుధజన మానస మందిరా ।
సామగానలోలానందా । నందహృదయ స్థిరమందిరా ॥భూ॥

2 దోర్దండద్రోహిద్రోహి ఖండన । దోర్దండనామండనా ।
అండపిండ బ్రహ్మాండ భాండములు । ఉండిలేవుఖమండనా ॥భూ॥

3 అయమాత్మ బ్రహ్మంబను వాక్యము । అంతటంతనే యుండెను ।
అయం వ్యర్థబాహ్యోకోపి నభవతి । అంతటతానే నిండెను ॥భూ॥

4 భూతేశ్వర విభూతిధరాహె । శ్వేతశరీర బింబాధరా
నాతనుషు సీదేర పుణ్యధన । నేతిరువర్ణింతురా ॥భూ॥

5 అఖిలలోకముల కాదిదేవుడవు । ఆనందాశ్రిత నందుడౌ
సకలశరీర వినామ దేవుడవు । సత్యజ్ఞానా పాంధుడౌ ॥భూ॥

6 తత్వమశీయనే త్వంపద తత్పద । తత్వము తత్వాధాతవు
తత్వఐక్య ఏత్వ తత్వ తత్వము । తత్వము తత్వాధాతవు ॥భూ॥

7 నేప్రణవంబనె నేసర్వంబున । నేనేసాక్షనలేదురా నా ప్ర
కృతి తత్వము త్త ముత్తది । ఉత్తమనామనో విత్తమా ॥భూ॥

8 ధరకోరుట్ల పరిపూర్ణబృంద । పాదారవింద సదానందుడౌ
స్తిరములోన నస్తిర స్తిర పరుడవు । స్తిరిపరిపూర్ణధారుడౌ ॥భూ॥

దయానంద పొన్నాల రాజయ్య రాజయోగిగారి కృతం



## 22. తత్వము

1 యేమోమీకరుణామృతంబూ । తెలియ । దేమోమీకరుణా మృతంబూ ।
నాస్వామిమిముబొగడ । నాదీ శేషనితరమ ॥యే॥

2 యెన్నోదిక్కులదిరిగి । వున్నాదెరుగలేక । తిన్నాగమిముజేరుకుంటీ ।
అన్ని : విధమూలమిమునమ్మియుంటీ । కన్న । తండ్రీనను కరుణించు
మంటీ । అన్న । మీకన్నదయదల్చి । బ్రోచేవారెవరన్న ॥యేమోమీ॥

3 సాధానంబులుజేసి । బాధాలొందితిగాని । యెదారితెలియాలేనైతివాద ।
భేదాములుడుగాలేనైతి । బోధ । గురువూలజేరాలేనైతినాదు । బాధాల
బోదోలి । భేదారహితపర్చు ॥యేమోమీ॥

4 నాసికాగ్రమూన । కాశీపురంబాని । వాసీగబోధింతురన్న । జీవ
బ్రహ్మైక్యపదవాదటన్న । కన్న। యికజన్మలేదానిరన్న । అన్ని। బాధా
లొందుటెకాని । బ్రమరహితమేదన్న ॥యేమోమీ॥

5 బూతినామాల్ బెట్టి । దాతాలమేమనుచు । ఖ్యాతీగబోధింతురన్న । కూటికై బ్రమసె కుక్కారీతన్న । వీరిబూటకపుమాటలువిన్న । వారి । డంబంబులనుజూచి । దండామర్పణజేస్తి ॥యే॥

6 ధరశికింద్రాపూర । వరగూరు హనుమయార్య । సరగూననను బ్రోవ రావ । పూర్న । భావంబు సూచించలేవ । దాతవనినమ్మిదరిజేర్తిగావ । పి. రాజయ్య । దాసూనిరక్షించువేవేగ॥యే॥

## 23. తత్వం

పైన నిన్ను వర్నించి చూడ పరమాత్మ స్వరూపంబు ।కలిగె నా యందు విచారంబు॥ దేశ దేషములు నీకొరకై యాతిరిగితీనిజంబు ॥కలిగె॥

1 చేసెటి పనులకు నీవే ముందూ । పసిపావలకు ప్రేమనీయందూ । గోసి బెట్టిన నిన్నె రమ్మందూ । దేషమంత నీకొరకే యింధూ । ఋషులు దిగంబర మునులకైన నీవుంటెనె సారంబు ॥కలిగె॥ పై

2 రూపవతుడు గాకున్నను గాని । పాపపు పనులను జేయనివూనీ । కోప మెల్ల బల్లంత నుండనీ । తేపకు యితరులనిందజేయనీ । చూపు నీదివా నందు గలిగితె పాలించు జగంబు ॥కలిగె॥ పై

3 వేశ్యయయ్యి విషయాదులోనున్నా । దాసిదయ్యి దశదిశలు దిరిగినా । ముసలిరూపమున మూల్గుచు నున్నా । పాసిపండ్లతొ రుచులు జూచిన । కాసులుంటెనె వారికందరు దాసులు నిక్కంబు ॥కలిగె॥ పై

4 మాటికి దేవుని స్మరణ జేసినా । వాటముగను వేదములు జదివినా । కొంటెచేష్టల నంట కుండినా । బంటువలితరులసేవజేసినా । యింటిలొ నీకలలేకపోయిన యిహమున నరకంబు ॥కలిగె॥ పైన॥

5 లేని స్నేహితము నీతో గలిగే। వున్న స్నేహితము నీతో దొలిగే। అన్ని పండుగలు నీతో వెలిగే । నిన్ను గాన కుంటన్నియు మలిగే । అన్నద మ్ములు అక్క చెల్లెండ్రు నీతోనె జగంబు ॥కలిగె॥ పైన॥

6 పన్నుగాను జయమొందుకొరుట్లా । పిన్నం శెట్టుల చెన్నయ్యిట్లా । నిన్ను గూర్చుటకు యెన్నియొపాట్లా। గొనుచుండగ నీ దయ రాదెట్లా। అన్నివిదంబుల కన్నతల్లివలె ఆదుకొధండంబు ॥కలిగె॥ పైన॥

ఓం




"పూర్ణానంద బిరుధాంకితు లైన
శ్రీ శ్రీ శ్రీ అరిగె రామస్వామిగారిచే
రచింపబడినట్టి తత్వములు, మేలుకొలుపు, కందపద్యములు,
కందార్థములు, ప్రార్థన సంకల్పములు

# చంద్

వినరయ్యా। మీరలకు। వినిపించెద। నొకసల । ఉన్నదిగనుక
లేందున్న దనెటి వారి కల ॥వి॥

1 నామరూపరహితా పరిపూర్ణంబు గలదు । అహంబ్రహ్మాస్మి హహమాత్మ బ్రహ్మనేననదు । తత్వమసీ ప్రజ్ఞాన బ్రహ్మమదికాదు । తత్వాతీతంబు తత్వమూ తానెరుగాదు । మనోవాక్కు దృక్కులకు తాను అందాదు । కన్నవారికి నైననూ చెప్పశక్యముకాదు । ఇదిసత్యము వినుడీ స్వత సిద్ధమై యుంది। గుణరహితం బిదిగో కదులదు । మెదులాదండీ ములు గృచ్చ సందులేకను సర్వము తానిండీ । ఎమిలేని దానియందేమో బుట్టినట కల్లా । ఉన్నది గనుక లేందున్నదనెటివారికలా ॥విన॥

2 మూలంబులేని ముక్తి కాంతొకటి బుట్టే । అందమల సత్వ ప్రదాన మలి నమైనదే । మొదటిది చంద్రునెడబాయని వెన్నెలనటే ।రెండోది అథో

ముఖంబై వెడలిందచే । యిది మూడు లోకములు బుట్టించితాబెట్టె ।
అందునా జీవుడై అమరింది తాగట్టే। దీనిచరియ వినుడి వేదశాస్త్రములు
వ్రాసె। దేహంబుగాను నే దేహి బ్రహ్మమని కూసె । దేహంబు లేకతా
దేహితానెందు నిలిచే । యింతటి రహస్య మెరుగని వారు పెద్దాల ।
వారు పెద్దాల ॥ఉన్నది॥

3 నామరూపము నటనముగలదీ మాయా । జ్ఞానా జ్ఞానంబు సత్తు చిత్తు
లేదాయా । అద్వైహితులకిది కంసపరబ్రహ్మ మనటాయా । మఠముల
వారికిదే సత్యమనటాయా । ఇది సత్యమైతె యెల్లప్పుడు నిల్వరాదా ।
వొకప్పుడుండి వొకప్పుడు లేనిది కాదా। చచ్చుట పుట్టుట స్వభావమగు
వినోద । కల్లల తల్లిది తెలియుట తెలివొకసేల ॥ఉన్నది॥

4 బ్రహ్మాండ భ్రాంతి యనే నిద్రలనే కలగంటీ । అందుపిండాండంబను
తల్లిగర్భముననుంటీ। మలమూత్రపు కుచ్చనే బయలుబడగ గనుగొంటి ।
ననుమాలోవాడని మనుజులు బిలువగ వింటి । ప్రేమచేత నొక చిన్న
దాన్ని పెండ్లి చేసుకొంటి । మేమిరువురము ఎల్లకాలముందుమనుకొంటి ।
ఆ యువతినొక చిన్నదాన్ని గనివారు చచ్చే । అందునారోదన మితిలేక
నాకెచ్చే । నాపాలి గురుడు నను తట్టి మేల్కొలిపి యెటకొజొచ్చే ।
కండ్లు తెరచి చూడ ఏమిలేదాయె గోలా ॥ఉన్నది॥

5 శ్రీ ఠరస్వాములు శివరామదీక్షిత గురులూ । అప్పబ్రహ్మముపరుశు
రామసీతారామస్వాములూ । భాగవతశ్రీకృష్ణ పీల్కాణలక్ష్మణా ప్రభులు'
సచ్చిదానంద వెంకటేశ్వరావధూత స్వాములు । భూమానంద బిరు
దొందిన మహా సుగుణులూ । మందిప్పల హనుమంత రాజయోగి
మద్గురులూ । ప్రేమచేత పూర్ణనందాయని బిలచే । వీరు బోదించిన
సత్యం బిదిగో తెలిపితీ తీరు । అరిగె రామస్వామి యని లోకులు నను
పిలుతూరు । వీరి బోధ ఎరుగక దూశించిన మోక్షము కల్లా ॥ఉన్నది॥

## 25. తత్వము

చరణం॥ బ్రాంతి రహిత గురుని గనుగొన్నా । భక్తులుజేర
బ్రమలు యుడిగిహ పరముగనెరన్నా ॥బ్రాంతి॥

శ్లో॥ బ్రమేణాహం బ్రమేణత్వం । బ్రమేణోపాసకాజనాః ।
బ్రమేణేశ్వర భావత్వం । బ్రమమూలమిదంజగత్ ॥

దర్వు॥ బ్రాంతిసహితుల జేరయున్నా । బ్రాంతినే బలపరచిలేని । బ్రమలు కల్పించిహపరంబుల బ్రష్టునిగ జేసేరునిన్నూ ॥బ్రాంతిరహిత॥

శ్లో॥ యధానాహం తధాశుద్ధం । తస్మాత్ శుద్ధేన నిర్ణయః ।
జగదస్తితికోవేద । నాస్తికోనచ నిర్ణయః ॥

దర్వు॥ నేను నీవేనహంబ్రహ్మన్నా । గనుమదేసున్నా నీవు నేనులేంది గనుగొన్నా । అహంబ్రహ్మ అయమాత్మ బ్రహ్మ **తత్వమసి** ప్రజ్ఞానమంచు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాధి, బ్రాంతి భడబాననల ముంచు ॥బ్రాంతిరహిత॥

శ్లో॥ త్యజధర్మమధర్మంచ । ఉభేసత్యానృతేత్యజ ।
ఉభేసత్యానృతేత్యక్త్వా । యేనత్యజసిత త్త్యజః ॥

దర్వు॥ ధర్మమిధియా ధర్మమదియంచూ। గనెడునేనా సత్యమిధి యాసత్య మధియంచూ। ధర్మధర్మా సత్యసత్యా నిర్ణయము జేసేటి గురుతున్। సర్వధర్మములతో పాటిసాక్షిని త్యజించచాలు ॥బ్రాంతిరహిత॥

శ్లో॥ గురుణావరణత్యాగః । అనావరణ ముత్తమమ్ ।
పరిపూర్ణం పూర్ణమేవ । పూర్ణాచల సముద్రవత్ ॥

దర్వు॥ సర్వేంద్రియ వృత్తిగగ్గినా। ప్రకృతి పురుషా శరీరాత్మల తీసివేసినా। అచలపూర్ణా వర్ణరహితా ఖండనిశ్చల నిర్మలంబై । అందుఇందు యనుట లేకను అంతటను నిండుండునోయీ ॥బ్రాంతిరహిత॥

శ్లో॥ అబీజం వృక్షసంపన్నం । శాఖాపల్లవవర్జితం ।
పుష్పంనాస్తి ఫలంనాస్తి । సంపూర్ణం వృక్షవర్జితం ॥

దరు॥ విత్తులేనీ చెట్టుబుట్టెనటా । బ్రహ్మాండ వృక్షమై వివిధ పలపుష్పములు బొడిమెనిటా । సత్తు చిత్తానంద కలయన్ । సర్వమునూహించె యెరుకన్ । సద్గురూబోధాగ్ని మేల్కాను సమయునోయి, సత్ విత్తులేకనూ ॥భ్రాంతిరహిత॥

శ్లో॥ ఉల్కాహస్తోయథాకశ్చి । ద్ద్రవ్యమాలోక్యతాంత్యజేత్ ।
జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాత్ జ్ఞానం వినశ్యతి ॥

దరు॥ అంధకారా బందురంబూనా । అస్తమున దీపం నంది వస్తూ జెందు విధమూనా । సంధియంబద్దేల హెయమును సాదనగగొని పరము నందీ । సద్గురూచరణముల వీటిని సమర్పించిన చాలునోయి ॥భ్రాంతిరహిత॥

శ్లో॥ అంతఃపూర్ణంబహిఃపూర్ణం । పూర్ణకుంభ ఇవాంభసే ।
అంతఃశూన్యంబహిఃశూన్యం । శూన్యకుంభ ఇవాంబరే ॥

దరు॥ అంతటను నిండున్నాదదుగో । యనుమద్దేశికు అందు ఇందు మరేమిలేదిదుగో । అంతటను నిండున్నదదుగో అవాఙ్మానసగోచరంబై । అందు ఇందు మరేమిలేకను అరిగె రాములందు వెదకిన ॥భ్రాంతిరహిత॥

దరు॥ కర్పూరాదీపంబులై వెలగీ, భూమానంద, పూర్ణానందూలనగ భరగీ, సహజముగ గురుశిష్యులిరువురు । సల్ప్రియా పరిపూర్ణబోధను, మాటలుమగ్నంబులాయె । మరియేమి యనుటకు లేకపాయె ॥భ్రాంతిరహిత॥

దరు॥ ఊహకంధనూహింపజేసితివీ సద్గురుమూర్తి ఊహపుల్గునుల్పివైచితివీ ॥భ్రాంతిరహిత॥

## 25. శ్రీగురుచరితంపాట

శ్రీమించు గురుచరితంజేరి స్మరించుటకై ॥
చెలులార ఇటురారె । ఓజనులార ఇటురారె ॥

1 అణుపారమాణుగానీ, గురు, దనుపారమాణుగానీ, అంతటనిండి, యగు పడి, యగుపడనీ, ఆధిమధ్యాంత రహితుం, డచలుండద్వీతీయు, డవాంగ్మానస గోచరమలుండయ్యెనయెట్టీ ॥శ్రీమించు॥

2 అండాపిండాండమునిండీ, గురు డండాపిండాండము నిండీ, బ్రహ్మాండ మవలఖండా, ఖండములుగానీ, దండీపూర్ణునియం, దెండామావులరీతి యుండేడీ బ్రహ్మాండమందు వెదకినలేనీ, గురుడందు వెదకినలేనీ ॥శ్రీమించు॥

3 కరచరణ, నవయవములులేనీ, గురున, కరచరణనవయవములులేనీ, పరి పూర్ణుని కనుగోనయలవిగానీ, చరాచరంగాదుల్, చైతన్యమునుగానీ, అరయ ఇట్టిదట్టి, దనరాని పరమోయీ ॥శ్రీమించు॥

4 అష్టాఅణుమాదిశిద్ధికైయి, జను, లష్టా అణుమాదిశిద్ధికైయి, కష్టించేడి, నిష్టాగరిష్టులందానీ, అష్టాతనువూలైనవ్యష్టీ, సమిష్టిఖూతాల్, నష్టా మొందిననిలచీ, ద్రష్టాకందనియెట్టీ ॥శ్రీమించు॥

5 హరిహార బ్రంహాదీ, శివసదాశివ ఆదిదేవతలూకానీ, అంబా, లక్ష్మి, వాణీ, శివశక్తిత్యాదులుగానీ, ఆత్మ, పరమాత్మ, జీవ, మూలమాయయు గానీ ॥శ్రీమించు॥

6 అనానందానందుడుగానీ, భూమానందూడానందములకావలీ, యానందా తీతుడూ, పూర్ణానందమునుమీరి, సహానందులకందాని, సద్గురుమూర్తిమా ॥శ్రీమించు॥

7 హరుగెవారగుయాహంబీ, అరుగని దాని ంొరుగుగుజేపరమానీ, సరగూన గురుజేరి, సర్వం, శూన్యముజేసి, అరిగేరాములు **గురుయందగుపాడ,**

దయ్యేజే॥శ్రీమించు గురుచరితంజేరింస్మరించుటకై, చెలులార ఇటురారె,
ఓ జనులార ఇటురారె ॥

## 26 సీసమాల

సీ॥ యెన్ని జన్మములైన యెత్తసిద్ధమెకాని ।
అభిమాన మహంకార మణచలేను ॥
విద్య ధనబలముచె విర్రవీగెదగాని ॥అభి॥
కోరికుటుంబముల్ కూల్చద్రోయుదుగాని ॥అభి॥
పేరుప్రతిష్టలకునయ్యె పెనుగులాడెదగాని ॥అభి॥
గురువులజేరి సద్గోష్ఠి సల్పుదుగాని ॥అభి॥
వేదశాస్త్రపురాణలితి హాసాల్వినికన్న ॥అభి॥
పరులకు నీతులు పలుకనేర్తునుగాని ॥అభి॥
బాదగురువునయ్యెబోధ జెయ్యుదుగాని ॥అభి॥
పాదపూజలుగొన పాటుపడెదగాని ॥అభి॥
శిష్యుల ధనమంద చెయ్యిజాచెదగాని ॥అభి॥
పీఠవెత్తనమొంద పీకులాడెదగాని ॥అభి॥
నెఱుకకులములనెత్తి నెత్తుకుందునుగాని ॥అభి॥

గీ॥ గురువరేణ్య నీ నిజరూపు గురిగలింగి ।
దురభిమానాంకారముల్ ద్రుంతునేని ।
కరతలామలకమైె ముక్తిగాకయున్నె ?
పరమగురుభక్తి కామయోయతిగె రామా ॥

27 సీ। గురువరేణ్య 'నీ' నిజరూపు గురిజూపినట్టిది ।
శబ్ద, బ్రహ్మమనుచర్చ సరియుగాదు ।
ఓం, మిత్యేకాక్షర బ్రహ్మమునుకాదు ।
ఖం, బ్రహ్మమనియనుట కదియుగాదు ।
సర్వ, బ్రహ్మముకాదు, సత్తబ్రహ్మముకాదు ।
చైతన్య, బ్రహ్మయని చెప్పరాదు ।

సాక్ష, బ్రహ్మముకాదు, సగుణబ్రహ్మముకాదు ।
నిర్గుణ, బ్రహ్మయన, నిజముకాదు ।
అనుబవ, బ్రహ్మమానంద బ్రహ్మముకాదు ।
వాచ్య, బ్రహ్మంబన వలను పడదు ।
తదాకార, బ్రహ్మనితాబలుక సరిగాదు ।
అనిర్వాచ్య, బ్రహ్మని యనుటకాదు ।

గీ॥ ఇట్టిచతుర్దశ బ్రహ్మల గట్టులోపవల । ఇవల
దట్టమై యున్నగురునందు ద్రష్టలేని ।
గుట్టుదెలసియు మరిజన్మ గూడుబెరకు ।
పరమగురుభక్తి కామయోయరిగె రామా ॥

శ్రీ పూర్ణానందాయనమః



# మేలుకొలుపు

1 మేలుకొను గురుపుత్రులారా - మేలుకొనరె పవిత్రులారా - మేలుకొను సుచెరిత్రులారా - మేలుకొనరయ్యా - ॥మిత్రమా మేలుకొనరే॥

2 గాఢనిద్రలొ మునిగియున్నా - తోడి మానవుల మేల్కొల్పి - కూడి యజ్ఞానాంధకారము గూల్చివేయుటకై ॥మిత్రమా॥

3 మానవసేవ మన గురునిసేవని - మరువకుడి ఈ మూలసూత్రము- మానవుండై రాక గురు మమ్ముద్ధరించునటే ॥మిత్రమా॥

4 బోధభానుండుదయించిన - భ్రమతిమిరము పొడచూపున - గురుని సన్నిధి జేరమనకి కొరతయుండునా ॥మిత్రమా॥

5 గురువాజ్ఞకు బద్ధులయ్యా - గురు శిష్యులేకమయ్యా - జరుప సర్వ కార్యములలో జయమెవినరోయీ ॥మిత్రమా॥

6 గట్టిగా గురు గుట్టు నెరిగి -పట్టుచే సంగకట్టుగట్టి - నెట్టు దౌర్బల్యము
ల నిహపర - నీతి నిలుపుటకూ ॥మిత్రమా॥

7 కలయ గురు శిష్యుల శక్తిని - కాలమెదిరించగబోదని- పలుకరే మన
మూలపురుషులు - పలుతెరంగులనూ ॥మిత్రమా॥

8 గురుబ్రహ్మ గురోర్విష్ణు - గురుదేవమహేశ్వరంచు - గురుసాక్షాత్పర
బ్రహ్మని గురియు జూపె కదే ॥మిత్రమా॥

9 గురుడెబ్రహ్మో త్పత్తికర్తని - యరసినసర్వోన్నతిభీజముల్ - పరగనా
ట పల్లప్రదంబౌ - కరువుదీరుగదే ॥మిత్రమా॥

10 సర్వకళలకు మూలసూక్తము - సరస్వతి యే గురునివాక్యము - అంది
జ్ఞానము బొందసౌఖ్యము-హైన్దవూలారా ॥మిత్రమా॥

11 పాలకుడు గురువిష్ణుమూర్తి - పాలించును జగత్ఖ్యాతి - నీతి నియ
మము శాంతి బద్రత - నిలుప నీ యిలనూ ॥మిత్రమా॥

12 తనుమనధనాదులొసగి - అనయము గురు కార్యదీక్షను - పనులు
సల్ప స్వాతంత్రలక్ష్మి - పలములొసగగనూ ॥మిత్రమా॥

13 గురుడు మహేశ్వరుడె కాలుడు - సర్వమును హరించె బుదుడు -
ఎరుగు మిట్టి శక్తి కాళ్యంచిలను బొగడగనూ ॥మిత్రమా॥

14 అణువులోనె సర్వజగములు - జనించి, మించి, చనుచునుండును -
కనుమిదే యుత్పత్తి, స్థితి, లయ కాలగతి యంచూ ॥మిత్రమా॥

15 గురుసాక్షాత్పర బ్రహ్మని - గుర్తెరుగీ యనువుకు యావలిదియని
యెరిగి యరుగా యరిగె రాములందు లేరోయీ ॥మిత్రమా॥

16 భూమనీగురువర్యుడాయె - భూమయేనీ దేముడాయె - భూమలోదోచిన
సర్వం బేమిలేదాయే ॥మిత్రమా॥ మే॥

*—ఓం శాంతి, శాంతి, శాంతిః—*



## 29. తత్వము

1 బోదరా నిశ్చలబోదరా । నిజగురునిబోదే బోదరా నిశ్చలబోదరా । బోదమర్మము తెలసి అనిశము । బాధలన్నియు వదలిపోవును । ఆదినున్న పరము దెలసి అహము రహితం బైన బోదే బోధరా ॥బో॥

2 యింద్రజాలపు యెరుకరా । దీనిమూలమేమియు లేదురా । యింద్రమహిమలు జేసి నిరతము ఈ షణ్ద్రయబంధమందున । యిడుములు పడుచుండెవారికి । వధలుమని బోధించెబోధే ॥బో॥

3 యీడపింగళజాడ దెలిసియు । గంగయమునల గూడిఅనిశము। త్రివేణి సంగము గోరుచును । తిప్పలు వేగంబుదీసి అప్పుడిప్పుడు యెప్పుడనకను । తిప్పలు లేనట్టిబోదె ॥బో॥

4 సూచన సద్గురుడు దెల్ప శుద్ద తెలివి వుదయమాయెను । సూపురూపు రహితమాయెను । చూడబోతె యెరుకలేదిక । చూడర గురుమేల్కయందున । చూచుటకు యిక యెరుకలేనిది ॥బో॥

5 కన్ను మిన్ను అంటుకున్నా వున్న పదవిని తెలసియెరుకా। యెన్నడునే లేదు అనుకొని ఏడకేగెనో యెవరు యెరుగరు । గాడచీకటి విడచి ఘడియలో కనరాకవేగం । కానరాక కనుమాయజేసెను ॥బో॥

6 చరాచరముల సంధిదెలసితె । చలనమేమియు లేనిదాయెరా । చరమ క్షరము రెండుగానిది । చపలులకు కనరాకయున్నది । చపలచిత్తము రహిత పరచెను । చేరిసద్గురుబోధ వేగమె ॥బో॥

7 పరసంధి అదిమనకు దెలసితె । బంధ మోక్షము భ్రాంతిలేనిది । పరులు నేనని యేటి భావము । పరుగువిడునికపరము దెలసి సుందరం బైనట్టి యెరుక । అందు ఇందునలేనిబోదే ॥బో॥

8 ముందువెనుకను నిండియున్నది । మూర్ఖులకు తెలియంగరానిది । మురయుచును సద్గురునిజేరగ । మోదమున గురుపదము దెల్పెను । మూడు గుణములు రహితపరచిన ॥బో॥

9 జగములన్ని సూన్యమాయెను । జన్మభ్రాంతులు తీరిపోయెను । జయ పదము పరిపూర్ణమాయెను । జగయుగంబులు లేనివాయెను । జనన మరణము రహితపరచిన ॥బో॥

10 బండివంశము గురునిబోధ । భవసాగరము విడిపించెబోద । బాధలేని బోధ దెలుసుకు । బండగుణములు చెండివేసెను । బోదరీతిగ గురు బోద దెలసి । సూర్యమాంబిక సూన్యమాయెర ॥బో॥

శ్రీ సద్గురువేనమః

30 మంగళహారతి

హారతులొసగెదనూ । అతిగెరామస్వామి శ్రీ పూర్ణానంద ॥హా॥
పరమేశ సద్గురు దేవ నీకిదొ ॥హా॥

1 దేహమనే మాణిక్యమందున సోహమనే వత్తివేసీ । మోహవారదనె చమరునుబోసీ । జ్ఞాన జ్యోతి వెలగించీ। ఓ .... జ్ఞాన జ్యోతి వెలగించీ ॥హా॥

2 రేచక పూరక కుంభక మనియెడు । పుష్పములను జతజేసీ । పాచితీగ యను భ్రాంతిని హారము । జేసీ, మెడలో వేసీ । ఓ .... జేసీ, మెడలో వేసీ ॥హా॥

3 బుద్ధిని సానగజేసి దానిపై । కోరిక గంధము దీసీ । ముద్దుగాను యా పరిమళ గంధము । శుద్ధిగ మేనుకుబూసీ। ఓ.... శుద్ధిగ మేనుకు బూసీ ॥హా॥

4 హెచ్చైన దేహేంద్రియంబులను । అక్షితలుగాజేసీ । స్వచ్ఛమైన యీ ఆత్మనైవేద్యము । చక్కగాను యర్పించీ। ఓ..... చక్కగానుయర్పించీ ॥హా॥

5 అహంకారమనె కర్పూరమునకు । ధ్యాన మనే యగ్ని బెట్టి సాహసం బునను నిన్ను జేరెను । శేషపాణి పట్టుబట్టి। ఓ .... శేషపాణి పట్టుబట్టీ ॥హార॥

## 31. మంగళహారతి

గురువరా మాంగళం । పరిపూర్ణాభావా గురువరా మాంగళం । మహాను భావా ॥గురువరామాంగళం ॥

గురువర మీ కరుణేమనితెల్పుదు । శరణుజేతు మీ చరణంబులకూ ॥గురువరామాంగళం॥

1 దండిగా సాంఖ్యమూ । వివరించిదాన । పిండబ్రహ్మాండమూ ॥ ఖండిత ముగ ఉత్పత్తి లక్షణము । నిండుగ నామది కందగ జేసిన ॥గురువరా మాంగళం ॥

2 కూరిమీతోడనూ । హంసోహంబనునా । తారకాభావమూ॥ నేరుపుతో షడ్చక్రములందా । పూరక, రేచక, దారులు జూపిన ॥గురువరా మాంగళం ॥

3 జీవశివైక్యమూ । అమనస్కమందు । భవదోష నాశమూ॥ సావధాన మున । సహస్రారమ్మున । భావమణగి నిర్భావం బౌననే ॥గురువరా మాంగళం॥

4 ఆత్మవూనీవానీ । శ్రుతులందు । ప్రత్యగాత్మవూ నీవానీ॥ సత్యజ్ఞానా నందము నీవా । నాత్మనాత్మలా వేత్తవు నీవనే॥ ॥గురువరామాంగళం॥

5 ఎరుక ప్రభావమూ । ఎరిగించి నీవే ఎరుకస్వరూపమూ॥ అరయనీవె ఆరోపంబనుచు। అరమరలే కపవాద మెరుగుమనె ॥గురువరామాంగళం॥

6 ద్వాదశీ మంత్రమూ । అంతటనూజూపి । షోడశీమర్మము॥ లేదని పంచాదశి దృష్టాంతము । బోధపరచి నాబాధలుమాన్పిన ॥గురువరా మాంగళం॥

7 సాందీపకృష్ణులూ । అర్జునోద్ధవా । శ్రీధరస్వాములూ॥ వందనీయ శివరామ దీక్షితులు । పొందుగ అప్పయ । చందంబిదియనే ॥గురువరా మాంగళం॥

8 శ్రీసీతారాములూ । భాగావతకృష్ణా । దేశికాచార్యులూ ॥ వాసిగలక్ష్మణ వేంకటేశ్వరులు । దాసజనుల కుపదేశ మొసగిరనె ॥గురువరామాంగళం॥

9 ధరవిజయవాడా। పురమందు కేసన వీరయ్యనువాడా॥ సరగున భూమానంద హనుమ। సద్దేశికేంద్ర చరణారతి యిదిగో ॥గురువరామాంగళం॥

## 32. తత్వము

1 గురుపూజ సమయామునందు, యితరనరులూ రాకూడదుయిందూ పరమభక్తులకూడి పాదాప్రదక్షణము, మురయూచుపీఠమును ముందూగ నొనరించు ॥గు॥

2 వంచనలేకను మించువేడుకలచే, పంచోపకారములు పద్ధాతినొనరించు ॥గు॥

3 సాధనాసంపత్తి శాస్త్రమాయలువదలి, పాదామెగతియాని ప్రమాణ మొనరించు ॥గు॥

4 స్వస్తికారోహణ సర్వదీక్షలునిచ్చి, హస్తకమస్తకముపై అనివుపదేశించు ॥గు॥

5 పరమయోగులకయ్యే పరిపూర్ణసూచన, కరుణాతొజేసి అకైవల్య మొసగేటి ॥గు॥

6 అరమరలేకను అచలబోధనుదెల్పి, పరితాపమైనట్టిభ్రాంతిదులిపివేసె॥గు॥

7 వాదబేధములేక మోదాముతో గురుని పాదతీర్ధమును ప్రసాద మొనగు మంచి ॥గు॥

8 స్థిరమైన ఈ బోధశివరామ గురుమూర్తి వరవెంకటేశయోగీంద్ర సద్గురు పాద ॥గు॥

9 అందముగాను "భూమానంద" రాజయోగి చంద్రూలైనట్టి యామందిప్పల హనుమంత ॥గు॥

10 బాసురముగ బండి రామస్వామి పరిపూర్ణ భావాము భక్తులాకుదెల్పె ॥గు॥

సర్వం శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు

జై సద్గురుమహారాజకి జై




## అచలగురు జండా వందన గీతము

జండాను పైకెత్తుమన్నా - అచల
జండా క్రిందానిలిచి దండ మిడుమన్నా ॥జం॥

అన్నివేల్పులకన్న మిన్నా - దీని
కన్న వేరొండులేదన్న మాయన్నా ॥జం॥

వేదాంతసారమోయన్నా - మాయ
వాదరహితంబైన బోధగనుమన్నా ॥జం॥

మోక్షమే బట్టబయలన్నా - అందు
సాక్షితత్వములేని సౌంజ్ఞనేసున్నా ॥జం॥

బ్రహ్మ విష్ణు మహేశ్వరులన్నా - పర
బ్రహ్మతత్వంబిదే బయలు గనిరన్నా ॥జం॥

శివరామ దీక్షితుల జండా - ఇది
భవనాశ స్థితిలేని పరిపూర్ణ జండా ॥జం॥

రాజమార్గంబైన భ్రాంతి రహితంబిది
సనక సానంద నారదులు విన్న బోధా ॥జం॥

భూమా అను, శృతి, వాక్యము లేని జండా, ఇది
ఆది. అంత్యము లేక అచలగురుజండా॥ ॥జం॥




శ్రీమద్బృహద్వాసిష్ఠ సిద్ధాంతనిర్ధారణులును,
శ్రీమదచల బోధ ప్రతిష్ఠాపనా చార్యులునునగు,
శ్రీమద్రామడుగు శివరామదీక్షితులవారి గురుపీఠముభక్తమండలి.

తే. గీ॥ కలిమిలేములు శాశ్వితములును గావు, నీటిపైబుగ్గతనువును నిలువ బోదు, అఖిలమునుమాయ, నిత్యమైనట్టి పదము, తెలియగోరిన వాడనోదేశికేంద్రా ॥

ఆ. వె॥ సతులసుతులహితుల సంపదజుట్టాల, నమ్మితన్నుదానునరయలేక భ్రాంతినొందువాని బ్రతుకెల్లను, బిసినికాయలోని పురుగుగతిదలంప॥

తే. గీ॥ చెవిటివానికిమృదుగానచవులవేల- రూడిఖరముకునమృతరుచులవేల, తివిరిగాడిదకును దివ్యతీర్థమేల-మంకుజనులకు నిజమోక్షమార్గ మేల॥

ఆ॥ వె॥ గురునిజేరగల్గి గురుతుగా పరమును-దెలియగల్గిగొప్ప తెలివిగల్గి- మొనసిమృగములట్లు మూడులైమిన్నక- చెడుదురల్పమతులు సిద్ధముగను॥

సీ॥ అర్థంబుభూములు నార్జింపగాదీరు॥ ఘనమందిరంబుల గట్టదీరు॥ సతులతో భోగింపసౌఖ్యమొందగదీరు॥ సుతుల వేడుకలెల్లజూడదీరు॥ బుట్టుముచ్చటలనుప్రొద్దు బుచ్చగదీరు॥ ధిరముగా పొరుగిండ్లదిరుగ దీరు॥ గార్యంబుబెంచుచూగలహమాడగదీరు॥ జెలువుగా పరుల దూషింపదీరు.॥

గీ॥ కోరినీచాత్ములను నెల్లగోల్వదీరు॥ మందమతులగు దుష్టమానవులకు
బవలురాత్రియుదీరదు పరమగురుని చెంత జేరంగబరమార్థ
చింతజేయ.॥

శ్రీ గురువేనమః

ఈ దిగువనుదహరించిన ప్రశ్నలకు వాచ్యార్థ, లక్ష్యార్థములుగా
సమాధానములు శ్రీ గురు భక్తులు తెలియగలరు.

ఇట్లు

శ్రీ భూమానంద మందిప్పల హనుమంతరాజయోగి



## -: ప్రశ్నలు :-

1 ఉపదేశమనగా నేమి, అయినందునగలుగు ఫలమేమి, కానందున గల్గు
నష్టమేమి ?

2 హృదయగ్రంధి యనగానేమి ?

3 ముప్పరి గొనమ్మదు వాక్యములననేమి ?

4 సద్గురువులచే రచియింపంబడిన గ్రంధములు శోధనజేసి తెలిసికొనుట
ముఖ్యమా లేక సద్గురువులే అవసరమా ?

5 యేమిబోధించిన వారు సద్గురులౌదురు ?

6 సద్గురువుల లక్షణములుయేవి, ఆశ్రమమేది ?

7 చతుర్విధశుశ్రూషలు గురునకు యెందుకు చేయవలె ?

8 సచ్ఛిష్యునకు నిజసాంప్రదాయ ధర్మములు అవసరమా, అనవసరమా,

9 గృహస్థాశ్రమమందున్న వారికియే ఆశ్రమమందున్న వాడు గురు
వగును ?

10 కాలాంతరమున ఈ శరీరము అగ్నిసంస్కారమొ లేక భూస్థాపనమొ అవును గదా తిరిగి జన్మకు వచ్చునదియేది ?

11 తిరిగి జన్మ ఉన్నదని చెప్పినందులకు నమ్మదగినసాక్ష్యమేమి ?

12 మోక్షమందు ఇచ్ఛగలవానికి ప్రధమమున నిత్యానిత్యవస్తువివేకము, యిహాముత్రార్ధఫల భోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షత్వము, ఈ నాలుగు సాధనములుగలిగి యుండవలెనని వేత్తలైనవారు ఆనతిచ్చినారు, యేమి ఇందులొ యేదైన ఒకటిఉంటె చాలదా ?

13 మోక్షము బ్రతికివున్నప్పుడా, చచ్చిన తర్వాతనా ?

14 దేనికి మోక్షము ?

15 కార్యరహితము మోక్షమా, కారణరహితము మోక్షమా?

16 మహత్తువలన మోక్షమా, సిద్దివలన మోక్షమా, మంత్రమువలన మోక్షమా, త్యాగమువలన మోక్షమా, యోగనువలన మోక్షమా ?

17 మోక్షము స్వాభావికమా, ఆగంతుకమా ?

18 కొందరుశరీరాత్మలు, దేహిదేహములు, అంగలింగములు, వేరువేరని బోధించినారు యిచ్చట మీకేమైన సందేహమా ?

19 ఆశ (భ్రాంతి) లేని వాడు కావలెనని యందురు, అది తనకు వేరుగ నున్నదా, తానెయైయున్నాడా ?

20 యివియే విధమున లేనివాడగును ?

21 జగత్తుమిధ్యయనిన అది అట్లుయెప్పుడగును ?

22 యెవరి అనుభవము వారిదేగాని, వకరిది వకరికిరాదని అందురు గదా, బెల్లము పదుగురికి యేకరుచిగా నుండునా వేరువేరుగా నుండునా, అయితే బ్రహ్మానుభవములో వకరి అనుభవము వకరికిలేక పోవుటకు కారణమేమి ?

23 మలవిక్షేప ఆవరణములు పోవుటకు మార్గములుయేవి ?

మల్ల యమ్ములనగా నేమి, వాటివివరమేమి ?

25 పరోక్షఅపరోక్షవిచారణచేతదెలియదగిన ప్రామాణ్యము లేవి ?

26 అధ్యారోప అపవాదములు యెందుకు చెప్పవలెను ?

27 జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, యీ అయిదు అంతరేంద్రియములు మానవునియందు యేకకాలమందు సంచరించునా?

28 యెనుబదినాల్గులక్షల జీవజంతువులలో మానవజన్మమే శ్రేష్ఠమనుటకు దీనియందు గ్రహించు జ్ఞానశక్తిగలుగుటకు గలతత్వవిశేషమెద్ది ?

29 దేవతలయొక్క ఒకదినము మానవులకు వకసంవత్సరము అని గ్రంధములయందు చెప్పబడియున్నది, యిందుకు నమ్మదగిన ప్రామాణ్యమేమి ?

30 మనపెద్దలు ప్రభవ, విభవాది సంవత్సరములు 60, అని నిర్ణయించినారు యేమి 70లేక80 వుండకూడదా, యిందుకు యేమైన ఆధారముకలదా?

31 ప్రణవమందుద్భవమైన అక్షరములు యెన్ని, వాటిలోపంచాక్షరములు యెన్ని, యేపంచాక్షరిశ్రేష్ఠము ?

32 జీవన్ముక్తి, విదేహముక్తికి గలభేదమేమి ?

33 పరమపురుషార్ధి యనగానెవరు ?

34 బంధమనగానేమి, దేనిచేకట్టుబడినందున బంధమనబడె ?

35 జయవిజయులు బ్రహ్మమానస పుత్రులచేశాపమును బొంది శ్రీహరిని విమోచనమడుగగా, భక్తిచేయేడు జన్మములకు, శతృత్వముచే మూడు జన్మములకు, నన్నుజేరెదరాయని ప్రశ్నించినారు, యేడు, మూడు జన్మములు అనుటకు కారణమేమి, పది అయిదు జన్మములకని అనలేక పోయినాడా యిందుకు మీ అభిప్రాయ మేమి ?

36 దీక్షయనగానేమి, ప్రతిజ్ఞయనగానేమి ?

37. 290 కందార్ధములు యెందుకు చెప్పవలసి వచ్చె గ్రంధవిస్తరణకు కారణముగా వ్రాసినకందార్ధమేది ?

38 శక్తిద్వయనిరాస కంభన, మీ విచారణవలన సమర్ధించిన అర్ధమేమి ?

39. 167, 168, 169, కందపద్యములకు మీరు గ్రహించిన తాత్పర్య మేమి ?

40. 129వ, కందార్థమునకు అర్థమేమి ?

శ్రీ "భూమానంద" మందిప్పల హనుమంతరావు గారు

ఓం

శ్రీ గురువేనమః

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠం

శ్రీ భూమానంద నిజపూర్ణబోధ నిలయం

శ్రీ పూర్ణానంద రాజయోగాశ్రమము ॥ కర్నూలు.

....: నియమములు :....

—: ధ్యానం :—

శ్లో॥ గురోర్బ్రంహ్మ గురోర్విష్ణు । గురుర్దేవో మహేశ్వరా ।
గురుసాక్షాత్ పరబ్రహ్మం । తస్మై శ్రీ గురువేనమః ॥

# పరిపూర్ణ బోధస్తోత్రం

శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యం। నహికరచరణం। నామగోత్రం। నసూత్రం।
నోజాతి ర్నైవవర్ణో నభవతి పురుషో । నానపుంసో నచస్త్రీ ।
నాకారంనైవకారం నహిజనమరణం । నాస్తిపుణ్యం నపాపం ।
నోతత్వం తత్వమేకం సహజసమరసం। సద్గురుం తన్నమామి ॥ 1

శ్లో॥ ఆత్మానాత్మవినాశ హేతు మనిశం । సర్వాతిరిక్తం శుభం ।
పూర్ణాత్పూర్ణమనామయంసుఖతరం । సర్వాపదధ్వంసకం ।
సర్వజ్ఞాన వినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం ।
సర్వభ్రాంతి వివర్జితం గుణహరం । సంపూర్ణబోధం నమః ॥

శ్లో॥ నజ్ఞాతం పరవస్తు నిత్య మచలం। సత్యంస్థితం శాశ్వితం ।
నిత్యానిత్య వివేక భేదరహితం । నిర్నామనిర్లేపకం ।
సర్వప్రత్యయహీనకంచ సతతం । సర్వత్ర సంస్థంపరం ।
వందేహం పరిపూర్ణబోధమనిశం । సందేహనాశం ప్రభుం ॥

* శ్రీ శివరామ దీక్షిత ప్రభుమహారాజకి జై *

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం
శివశాసన తశ్శివశాసన తశ్శివశాసన తశ్శివశాసనతః ॥

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యా గురువిష్ణు సూర్యం
శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకంచ ॥
సాందీపమీశం కృష్ణంచ అర్జునం
వందేగురున్మే గురుపాదుకాంతం ॥ శి. బ్ర. సి.

కం॥ప॥ శ్రీకృష్ణవేమన్న శివరామధీక్షితుల్ ॥ భాగవతకృష్ణుండు
భానుడనగా జనకశుక సాందీప జగధీశు బోధి దీ═పరమ
భక్తి కామ అరిగెరామ ॥

శ్రీ పూర్ణాయనమః

## శ్రీ గురుసాకారస్థవ సంకల్పము

ఓం, సర్వవ్యాపక, సర్వాంతర్యామియగు, యోనర్వేశ్వర, నీవె నా సంకల్పమూర్తి వగుటన్జేసి,యా,నీదివ్యమంగళ, మహా అద్భుత శక్తిని నే వృద్ధిదేకింప, పురిగొల్పి, నా ఇచ్ఛా పూర్తికై ఇట్లు, సంకల్పించుచున్నాను,

గురుమూర్తి! నీ ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఆదిశక్తి, పరాశక్తుల ప్రభావముచే, పంచమహాభూతములసత్తా ప్రభావముచే, స్మరణ, సంకల్ప, సత్తా, ప్రభావముచే, ఈ సర్వశక్తులు అఖండరూపమున, నానఖ, శికపర్యంతరము, సర్వాంగ అవయవములందు, సర్వాంగశల్యాంతర్బహిర్ముఖముల యందు, సర్వాంగమాంసఖండరముల అంతర్బహిర్ముఖముల యందు, సర్వాంగచర్మాంతర్బహిర్ముఖములయందు, సర్వనాడులయందు, సర్వరక్తఖణ, ఖణములయందు, ప్రసరింపన్‌జేసి, సర్వవిధదుష్ పదార్థములను, మల మూత్రరోమద్వారములగుండా బయటికి త్రోసిపుచ్చి, శతవత్సరంబులకు మించి, పూర్ణఆయు ఆరోగ్యము, నీ అద్భుతబలశక్తులను ప్రసాదించుచూ అట్లేనా మెదడు, హృదయము పూర్ణ ఆరోగ్యవంతముగాజేసి, శక్తివంతముగా జేసి, పవిత్రవంతముగా జేసి, దుస్సంకల్ప, దుష్పదార్థరహితమై, సదాసు సంకల్పములకు, శాంతశమదమాధి సద్గుణంబులకు, ధైర్య సహాస వుత్సాహంబులకు, కార్యశూరత్వమునకు, నిశ్చలత్వమునకు నిలయమై, ఊహాగ్నాపక సుసంకల్ప, కల్పనాశక్తులకు స్థావరమై, అందునీవు సదావాసంబుజేయుచు, గురుమూర్తి! నీ బ్రహ్మాండ అవరణలో, ఇమిడియున్న, సర్వ, మతమతాంతర, వేదవేదాంగ, శాస్త్రపురాణ, ఇతిహాస, శారీరిక, మానసీక, ఆర్థిక, సాంగీక, వ్యవహార, రాజకీయ,శౌశష్టి విద్యల గూఢ రహస్యములను సర్వవిధకళలమూల సూత్రములను, యుక్తిప్రయుక్తులను, సమయోచిత కాలగ్నానమును, త్రికాలగ్నానమును, తత్ఫలములను, తండోపతండంబులుగా ప్రసాదించుచూ, తద్వార, సర్వజీవ మానవకళ్యాణమునకు, శేవజేయుటకు, జేయించుటకుగాను, సర్వవిధదుష్టశక్తులను హరించి, అనుకూలశక్తులను దినదినాభివృద్ధిజేయుచూ పూర్ణఆయు, ఆరోగ్యము, సంగాంగబలము, ధనము, విధ్య గ్నానము, వైరాగ్యము, పరిపూర్ణసుఖానందంబగు, రాజకీయ, ప్రదాన అధికారకీర్తి, యశంబులను ప్రసాధించుచూ, తుదకు, నన్ను ముక్తునిగాజేయుము, గురుమూర్తీ!

ఓం, శాంతి, శాంతి, శాంతిః

శ్రీ పూర్ణానంద రాజయోగాశ్రమము

## -: సిద్ధాంతము :-



శ్లో॥ విద్యాంతంబ్రహ్మ విద్యాంతం। వార్త్రికాంతమగోచరం ।
పూర్ణ బోధం ప్రవక్ష్యామి । శృణుశిష్య మహోత్తమం॥

ఇట్టి ఈ శరీరము పృధివాంశమగుటచే । పంచముఖ బ్రహ్మమై పంచముఖబ్రహ్మమే విష్ణువై, విష్ణువేరుధ్రుండై, రుధ్రుండేశివుడై, శివుడేసదాశివుడై, సదాశివుడే మూలప్రకృతియై, మూలప్రకృతియే అచలమై, అచలమే శూన్యమై, శూన్యమే మహాశూన్యమైనశించుచున్నది ? "గురువాక్కుచె తెలియగలరు॥"

ఈవుత్తబట్టబయలు ఏమిలేదు; మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. కలలోదోచిన శరీరములు యేలాగోఆలాగే,-కర్పూరము కలిక కూడితేయేలాగో ఆలాగే. ఈ అండ పిండబ్రహ్మాండపర్వంతరము, కను మూసిన కనుతెరచిన, కానంబడుచరాచరద్రుశ్యమాన యెరుక ప్రపంచము యావత్తున్నూ, పరిపూర్ణాచల పరబ్రహ్మ స్వస్వరూప సాక్షాత్కారానుభవము నందు యేమిలేదు, యేమిలేక యున్నదానిలో యేమిలేకనే, యెరుక ప్రపంచము, తోచి, కలిగియుండి, సర్వవ్యవహారములు చేయుచూ తుదకు యేమిలేదు. వున్నదేపరిపూర్ణాచల పరబ్రహ్మము, స్వత సిద్ధము దీనికిబదులు లేదు. సకలదేశములయందు, సమస్తమైన వస్తువులయందు, సర్వకాలాల యందు, చలించక ఆధిమధ్యాంతరహితమై సూధిమొనమోపసందులేక సంకల్పములేక బావరహితమై నిండియున్నది, ఈ బావముదృడమగునంత వరకు, నిధురవచ్చునంతవరకు, మరణమువచ్చునంతవరకు, యే, మరు వకగురువాక్యత్రయములు, మంత్రములు మూటిని, శ్రీనిజగురునిచే ధర్మ మర్మములుదెలిసి, జపించుచూ, ధ్యానముచేయుచూ, బావపూర్ణత జెందవల యును ? ఇది యేగురుని ఆజ్ఞ ! ఇంతకుమించి మరి యేమియులేదు.

ఈవుత్తబట్టబయలే, సత్యము, సత్యము, **సత్యము**, సత్యము.

భక్తులగు ముముక్షువులు, సాధకులు, సిద్ధులు ప్రతిదినము ఉదయము, రాత్రి గురుధ్యానముచేసి, ఈస్తోత్రముజేసి, దీని ప్రకారము, నడ, నుడి, భావనజేయ, ప్రయత్నములో నుండవలెను.

—: జై బోలో శ్రీ సద్గురునాథ మహారాజుకీజై :—

కీర్తన॥ గురువరా పరిపూర్ణబోధ, గురుతులోనను గూర్పరా ।
యెరుకమరుపులు రెండులేని, యచలమార్గము జూపరా ॥గురు॥

2) యందరికి సుతుడై యి నే నిల, తండ్రినెందరికైతినో ।
ముందు జన్మమెత్తనీయక, నాయందునీదయరానిరా ॥గురు॥

3) నీవు నే ననకయుంటె, నిజమదే నిలచుండురా ।
చావు పుట్టుక రెండులేని, దేవుడైతా నిలిచెరా ॥గురు॥

4) విశ్వమందుగలసినిన్నెట్లు, వినుతిజేతురా ।
శాశ్వితంబైనట్టి బయలే, సతతశుద్ధ మాయరా ॥గురు॥

5) సిరిగళాకో మద్గురూ, శంకరా, చేరిదీవన లివ్వరా ।
నిరుప వేద మానసా, దివ్వ నిత్య సత్య నిరంజనా ॥గురు॥

శ్లో॥ గురుపాదార్పితం పుష్పం । తత్పుష్పం శిరసావహం ।
కోటిజన్మ కృతంపాపం । తత్ క్షణేన వినశ్యతి॥

* సర్వం సంపూర్ణం *

-•: నియమావళి :•-

1 గురుమంత్రోపదేశమైనవారెల్లరు భక్తులనబడుదురు.

2 భక్తుల యొక్క భక్తి, సేవ, భజన, శ్రద్ధలను గమనించి సూచన గావింపబడినవారు ముముక్షువులు.

3 భక్తి, జ్ఞానవైరాగ్యము గలవారై, జన్మరాహిత్యపదవిని సాధించు ముముక్షువులు సాధకులుగా పరిగణింపబడుదురు.

4 ప్రతదినము ప్రాతఃకాలము 5 గంటలకంతా మేల్కొని కూర్చుండి నియమములను ధ్యానించిన తరువాత స్నాన, జపతప సంధ్యానుష్టాన ములు గావించి, తన గృహకృత్యములను నెరవేర్చుకొనవలయును.

5 గ్రంథపటనము, అధ్యాత్మికశ్రవణము, ఆత్మానాత్మవివేకము, నిష్కామ కర్మసదాసక్రమముగా సలుపుచుండవలయును.

6 తనుమనధనములు గురువునకు వినయంబుగా ధారబోసి, నిస్పృహుడై, త్యాగబుద్ధిచే అచలగురుపీఠం యొక్క అభివృద్ధి, మరియు మానవ మాతృలకళ్యాణము మొదటి కర్తవ్యమని ప్రాదేయపడవలయును.

7 ముముక్షువులు వారి యొక్క శారీరిక, ఆర్థిక, నైతిక పరిస్థితులను మండలిలో తెలుపుచుండవలయును, మరియు ఒకరికొకరు తమశక్త్యాను సారముగ తోడ్పడుచుండవలయును.

8 మండలిలో జరుగు ప్రతిసోమ, బేస్తవారపు, బోధలకు, మరియు వారికై ప్రత్యేకముగా నియమింపబడిన బోధలకు, పౌర్ణమి యిత్యాది పూజలకు తప్పకరావలయును.

9 ఘనమైన పరిపూర్ణబోధప్రభావము జనులంతఃకరణమునందు వ్యాపింప జేయవలయును.

10 అచలగురుమండలిలో చేరిన శిష్యబృందమునందు ప్రేమ, ఐక్యమత్యము సోదరత్వము, సేవాభావము నెలకొలుపునదేగాక, వారితోనెట్టిహాస్యములు మరియు పరిహాసములు చేయకూడదు, ప్రతిశిష్యునియొక్క నడనుడి భావనలు తెలుసుకొనుచు మండలియందు తెలుపుచుండవలయును.

11 తమకువీలైనంతటి సమయమును మండలి కార్యములలోను అచలగురు పీఠం అభివృద్ధిలోను మరియు మానవసేవలోను వినియోగించుచూ, దేశ కాలపరిస్థితులననుసరించి, భక్తముముక్షువులభక్తి శ్రద్ధలను గమనించి వారికి తగిన మండలికార్యములను నియమించవలయును.

12 మండలి నియమానుసారముగ నడుచుకొనుచు, వారిపై నియమిత అధి కారుల ఆజ్ఞోలంఘనముచేయకుండ, అదిగురువాజ్ఞయని తలంచి శిరసా

వహించినడచుకొనవలయును, భక్తులు, ముముక్షువులు, సాధకులు నడ
నుడిభావనలో సక్రమముగా నడువక లోపములు గలిగినచో గురువాను
గ్రహము పొందువరకు పవిత్రులుగా యెన్న బడరు, పతితులుగా పరి
గణింపబడుదురు.

## శ్రీశివరామదీక్షిత అచలగురు పీఠమహాసభలు

శికింద్రాబాద్ నివాసులగు, శ్రీ పూర్ణానంద అరిగె రామస్వామి మహా
రాజుగారికి వారి గురుమూర్తులైన శ్రీ భూమానంద మందిప్పల హనుమంత
రాజ యోగీశ్వరులవారు, వాదికి "పూర్ణానంద" బిరుదము ప్రసాదించిన
సందర్భమున వారు వ్రాసుకున్న కందార్థములు.

కం॥ గురుడు తల్లి తండ్రి గురుడాప్తబంధువు -గురుడేదైవమంచుగురిగ
లుంగ, గురుడురక్షించును, గుణహీనునైనను ॥అ।ను।భూ॥అరిగె॥

కం॥ చిలుక పలుకులు బల్కె చిరుతపాపలకెట్లు - పరమోపదేశంబు పట్టు
బడును, గట్టుమొరుగినకుక్కగతిగురుమూర్తిదౌ ॥అ।ను।భూ॥అరిగె॥

కం॥ కవినిగాను విద్యకలవాడగానోయి - జనులమెప్పులకునేజెప్పలేదు ।
నాభావ మిమిడిస్తి నచ్చెనాజదువుడి ॥అ।ను।భూ॥అరిగె॥

కం॥ పంచకావ్యంబులపటియించగాలేదు-చెందస్సు వ్యాకర్ణ చెర్ప యెరుగ
యేమి కవిత్వంబో యెరుకిట్లు బలికెరా ॥అ।ను।భూ॥అరిగె॥

కం॥ అనుమ గురుడే తల్లి। అనుమగురుడే తండ్రి । అనుమ గురుడే గురు
అను దైవము।అనుమగురుడచలంబు-అన్యంబు లేదంచు॥అ।ను।భూ॥

## *-* కందార్థములు *-*

ప్రేమచెకుక్కను పులియని । నామంబిడి పిలిచినంత । నది పులి
అవునా । గోముఖవ్యాఘ్రములాంటి । పామరులకు పూర్ణానంద ॥ పదవి
గల్పించ । మారుచెట్లు మదమదికరించ ॥ కామక్రోదాదిదుశ్కర్మాదులనిచి
భువి భూమాది భ్రమలొంచా । పూర్ణానందనజెల్లు ॥ప॥

నిందయొనర్చిన వ్యసనము। బొందకనిను సర్వజనులు బూషించిన। యానందంబొందక యుండిన అందరు నినుపూర్ణనందా॥యందురోయన్నా। పదవుల భ్రమలోపడిమునుగకున్నా ॥ సందేహమేలా సర్వత్ర బయః్నను జూచి। యందుండకుండ నిన్నెగరకొట్టిననాడె ॥యం॥ 2

అనంద నిరానందావళి। యానందమె గురుడు పూర్ణానందం బనుచుఁ। తానందిదెల్ప। దుష్టుడా యానందార్థమును। పెడ॥యర్థమవు నట్లు। యంగడినెట్టె। యానందకోట్లు॥ మానాయవుమానాది మరియాదలటు బెట్టి। కానూకలే ముక్యాక ర్తవ్యమగునట్టి ॥య॥ 3

అనందులఁగడిన। నిర్దయానందగురులు కొంపలార్చుట కన్నన్। గానం బితరవృత్తులవి। మానంబిడమాయకులను॥ మాయాలోదించన్। మేమెరిగిన దెవరెరుగరనుచుఁ ॥ పూనిశిష్యులయట్లు బోధించనియమించి। యానందులనుపీరూ యంపేరునలుదిశల ॥మా॥ 4

మేమెరిగిన బోదమర్మము। యేమానవు లెరుగరనుచు। యెత్తులు యెత్తి సామాన్యజనను యదవల కామాతురులైన గురులు ॥ కడుశిగ్గుమాని। చెరిచేరు వార్ని తమబుద్ధిబూని॥ అమలమద్వీతీయ అచలబోథలోకుటిలా కుమతూలూ గురువులై। గూర్చేరు యపకీర్తి ॥క॥ 5

మాటల వేదాంతంబుల బూటక గురు శిష్యులచల బోదన్దెలియఁ చాటున నేటున ద్వివిదానాటక నటనటికులైరి॥ అచలబోదఁదుఁ। కుచ్చితు లెట్లు గురినిల్పెరిందుఁ ॥ మాటామాటలు లేని ధీశైన యీబోదా కూటామిలో క్రియదాటికి నిలచేరే ॥న॥ 6

శిష్యుల బ్రమలోముంచను। శిష్యురాంధ్ర పిచ్చినగూల్చ। సిరులు హరించఁ। మిషజేతురచలబోదనీయషమోస యెంతవరకు ॥ యగుపడ కుండుఁ। నలుదిశల్వీరియల్లరి నిండుఁ ॥ మసిబూసినట్టిముఖరమునుకు దీమని యట్లు గుసగుసావరగ్రామ గొందిలోగునిగేరూ ॥య॥ 7

గురువులమని పేరిడుకొని, పరసొత్తులరించ, పీటాత్పతిపదవులకై, పదువులిడె చండాలుర, నరులెరుగక ఆశ్రయించా॥ నరకమె కాదె, నెరిగిచే

రామూర్ఖామెకాదె॥ పరులక్షేమముకిట్టి పాఖాండగురువుల, పురజనోత్తములెల్ల పూనీదూనాకున్న ॥న॥ 8

మదుమైదున మాంసభక్షణ, విధిగా గురుపూజలందు విరివిగవాడె పదవిలోపీటాద్వతి రుషులట సదమల పరిపూర్ణబోధ॥ సద్గురులాట, వంచకులిట్లు వర్ధిల్లెబాట॥ హృదయమలినమిడక, పదవి భ్రాంతులజిక్కి అధములు తామెట్లు అచలాగురువులవూటా ॥న॥ 9

కరికోరలంటి నీతులు, మరిలో దౌడపండ్ల మరుగుకర్మలీ । నరబకములుండు సంస్థనిది । తరమాకడతేరయెన్ని॥ తరములకైనా । యెరుగుడీదస్యుల్ త్నెదిరించియైన ॥ అరయగ ఈనిర్ధయానంద గురులు । స్వాగురులనైన విడక గూల్చేరు యిడుముల్లో ॥త॥ 10

బట్టబయలు బయలుగాదట । ఇట్టిగబ్బాల్ బలికె యెరుక యెరుకగాదట । మిట్టిపడి గబ్బికూతలువట్టిఅమాయకుల దనముల్॥ వదలించెకొరకు॥ బూటకానందుల్ బోధించెసరకూ॥ దిట్టయినపూర్ణబోధ, దీరులు యిహపర రట్టులడంచి కుమతి రద్దుల ననచారె ॥వ॥ 11

అద్దుపద్దులేక రచ్చేలో । శుద్ధాబద్ధంబులాడు । శుష్క్వేదాంతులు । బద్ధులగు శిష్యజనముల। బుద్దులు వీర్దిద్దుటెట్లిబుద్ధిహీనగురువుల్ । సిగ్గెగ్గులేక శిథిలించవరువుల్ ॥ శుద్ధాపరిపూర్ణబోధ పెద్దలమనుటాకా । శుద్ధాముదినేపీతిత్ । గద్దలంస లౌనె ॥బు॥ 12

భ్రమరైత పూర్ణబోధలో । భ్రమలకు మూలంబులైన। పదవులుగోరే భ్రమసైత గురులుబోదా । క్రమమెరుగని వారలెట్లు ॥ కడతేరుటెట్లు । ఆశ్రితులీరు కడతేర్చుటెట్లు ॥ భ్రమరామె కీటమును తమవలె జేయును । సమమౌన కీటము । భ్రమరములతోసాటి ॥క॥ 13

తను మన దనములరించెగురు । తన మనదనాదులట్లె । తానర్పించక । కనుగొనెందుందు రిరువురు । అనయము పరిపూర్ణబోధం॥ దలరుచునుండుక । వీర్నెరుగ సక్యమెవరికి యుండున్॥ జనులక్షేమమెవీరి జన్మయక్కనునట్లు । పనిబూనిసేవాతత్పరులై ముక్తులన ॥ద॥ 14

వకచేత రాజ్యంగము । మరియొకచేత యద్యాత్మ తత్వయోదులై గురులై । శుక అర్జునులకు తెల్పిరె । అకలంకంబైన పూర్ణ ॥ నచలా బోదిలనూ॥ భుక్తిముక్తిబొంది భ్రమలిడను ॥ యుక్తాయుక్తము దెల్పెయుక్తి శాలి గురులా । భక్తులా శ్రయించా । బడయారె అతిగూఢ ॥న॥ 15

గురువర్యుడె పరిపూర్ణం । బరయగ బ్రహ్మాండమనంగ । ఆత్మ ఈశునై । తిరముగ పిండాండంబున చరమచరస్థూలజీవ ॥ చైతన్యమునై । తర్కించ అష్టతనువులుతామై ॥ నరరూపమున పూర్ణదర్మామర్మములెరుగా। కరిస్వప్నమున హరిని, కన్నచందంబెల్లా ॥చై॥

ప్రకాశకులు : పూర్ణానంద రామేన ఆదినారాయణ

* శ్రీశివరామదీక్షిత అచలగురువరంపరులగు *

—: ఏతద్గ్రంధకర్తలైన :—

శ్రీభూమానంద, హనుమంతరాజయోగిగారి

శిష్య మండలి

1 అబ్బుగారి వీరయ్యగారు, (దీక్షానామం) నిశ్చలానందం
2 అరిగెరామస్వామిగారు, (దీక్షానామం) పూర్ణానందం శికింద్రాబాదు
3 బండిరామస్వామిగారు, (దీక్షానామం) బ్రహ్మానందం తణుకు
4 కేసనవీరయ్యగారు (దీక్షానామం) నిర్మలానందం కొవ్వూరు
5 బి. రామసింగ్‌గారు (దీక్షానామం) నిశ్చలానంద్ బెజవాడ
7 అంకెనపల్లి రామస్వామి, 8 పొన్నాలరాజయ్య, 9 జొన్నాడదుర్గయ్య 10 తోటవెంకటస్వామి, 11 శివపురపు విశ్వనాదయ్య, 12 దొంతిరామస్వామి, 13 మోరాముత్తయ్య, 14 గూడపాటి ఆదినారాయణగార్లు, 15 దగ్గుపల్లి వెంకన్న, 16 సాకానరసింహ్ములు, 17 గురుబస్వయ్యస్వామి

ఈ ప్రకారం శిష్యమండలిగలదు, ఇందులో శ్రీసద్గురుమూర్తిచే దీక్షా నామములనుపొందినవారలు గురువాజ్ఞాప్రకారము, అయాగ్రామములయందు శ్రీశివరామదీక్షితాచలగురుపీఠములనునిర్మాణించి ప్రతిపౌర్ణిమకు గురుపుత్రుల యుక్తంగా, శ్రీగురుపూజయున్ను; తత్త్వవిచారణయున్ను, జరుపుతూ దర్మార్థకామమోక్షములను పొందుచున్నారు.*